# పాడవోయి భారతీయుడా

# సినిమా పాటలు








విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్

హైదరాబాద్-500 001.

PĀDAVOYI BHARATEEYUDĀ - By: SRI SRI

మొదటి ముద్రణ : ఫిబ్రవరి, 1983 శ్రీశ్రీ ప్రచురణలు

ప్రచురణ నెం : 2124

ప్రతులు : 2000

వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ : ఆగష్టు, 1995

ద్వితీయ ముద్రణ : జనవరి, 1999

వెల: రూ.20-00



ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్
హైదరాబాదు, విజయవాడ, విశాఖపట్టణం,
గుంటూరు, తిరుపతి, హనుమకొండ,
అనంతపురం, కాకినాడ.

ముద్రణ : శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్ : 3229831

# అంకితం

*

"ఆహుతి"
డబ్బింగ్ చిత్రం
ద్వారా నేను చలనచిత్ర
రంగంలో ప్రవేశించడానికి
ముఖ్యకారకుడూ, తెలుగు సినీమా
పాటలకూ సాహిత్య ప్రకాస్తి సంతరించిన
ఆద్యులలో ప్రముఖుడూ అయిన సుహృన్మణి
మల్లాది రామకృష్ణశాస్త్రికి.............

# బాల వాక్యం

- యస్.పి. బాలసుబ్రహ్మణ్యం
(నేపధ్య గాయకుడు)

ఒక నూతన లోకాన్ని ఆశించి, అధునాతన కవిత్వాన్ని శాసించి, "మహాప్రస్థాన" కావ్యంతో యుగకర్త అనిపించుకున్న మహాకవి శ్రీశ్రీని సినీ రచయితగా పరిచయం చెయ్యడం కొండంత అపచారమే అయినా నా వరకు గోరంత ఉపచారంగా కూడా భావిస్తున్నాను.

చలంగారన్నట్లు "లోకం బాధంతా తన బాధ" అనుకున్నవాడు కనకనే రాసిన ప్రతి పదం ప్రతి పాటా "పదండి ముందుకు" అంటూనే ఉంటుంది.

శ్రీశ్రీని ద్వంద్వసమాసం అనవచ్చో కూడదో నాకు తెలీదు గాని ఆయన కవిత్వంలో మాత్రం ద్వంద్వ స్పందన ఉంటుందని నిర్ద్వంద్వంగా చెప్పగలను. ఆకాశాలను లోకానికి చేరువగా తీసుకురావాలి లోకం. ఆకాశానికి ఎగరాలని ఆశించిన అభ్యుదయ కవితాచార్యుడు శ్రీశ్రీ.

శ్రీశ్రీ అభ్యుదయకవిత్వానికి యుగకర్త మాత్రమే కాదు. కర్త, కర్మ, క్రియ అన్నీనూ !

గానానికి ప్రాణం సాహిత్యం. కంటితో విని, సరిపెట్టుకోకుండా చెవితో చూడగలిగితే సినిమా పాటలలో ఉన్న సాహిత్య చిత్రాలు అర్థమవుతాయి. అలాంటి చిత్రాలు వేసినవాడు, రాసిన వాడు శ్రీశ్రీ.

"వెలుగు నీడలు" చిత్రంలోని పాటలు గుర్తొస్తే మహాకవి శ్రీశ్రీ ముద్ర చిత్రగాత్రాలకుకూడా ప్రాణం పోస్తుందనిపిస్తుంది.

అదే చిత్రంలో "పాడవోయి భారతీయుడా" అనే పాటలో శ్రీశ్రీ చిత్రించిన దేశ స్థితి (అదుపులేని నిరుద్యోగం, అవినీతి, బంధుప్రీతి, చీకటిబజారు) నేటికీ అలాగే వుంది.

"గాంధారి గర్వభంగం" అనే డబ్బింగు చిత్రానికి పాట రాసిన, "మనుష్యుడేల మహానుభావుడే" అనే తనదైన నాదాన్నీ, నూతన వేదాన్నీ వినిపించడం శ్రీశ్రీకే చెల్లినా, తెలుగు వారికీ, సినీ పరిశ్రమకీ ఆయన ఋణం యింకా చెల్లనిదే.

"తెలుగువీర లేవరా – దీక్షబూని సాగరా" అనే పాటలో, "సింహాలై గర్జించాలి, సంహారం సాగించాలి" అని నాటి తెలుగు జాతి తెగువ చూపిన విధానానికి అక్షరరూపమిచ్చి జాతీయ బహుమతి పొందిన శ్రీశ్రీ, విదేశీయుల ప్రశంసలందుకున్న శ్రీశ్రీ కవితా సంకలనానికి ఈ "బాలు"ని నాలుగు మాటలు ముందు పేజీలలో ఉండడం నా అదృష్టం.

అక్షరాలతో ఆడుకోడం, పదాలతో పాడుకోడం, పదబంధాలతో పరిహాసాలాడడం మహాకవికే సాధ్యం.

రాసిన పాటకి ట్యూను కట్టుకున్నా, చేసిన ట్యూనుకి పాట రాబట్టుకున్నా శ్రీశ్రీ శ్రీశ్రీయే

అందుకే ఆయన మహారాజశ్రీ శ్రీశ్రీ

మద్రాసు<br>17-1-83

భవదీయుడు<br>బాలు

# కృతజ్ఞతలు

ఎట్టకేలకు "శ్రీశ్రీ సినిమా పాటలు – పాడవోయి భారతీయుడా" పుస్తకం వెయ్యగలుగుతున్నాను." ఈ పుస్తకం బైటికి తీసుకురావడానికి చాలా కాలం పట్టింది. ఎప్పుడో రావలసింది. ఇప్పుడు విశాలాంధ్ర వారి సహకారంతో వచ్చింది. ఇక శ్రీశ్రీ సినిమా పాటలు, పద్యాలు 4,5 సంపుటాలుగా తీసుకురావాలనుకుంటున్నాను. ఈ పుస్తకం ముద్రణ విషయంలో తామున్నామని ధైర్యం ఇచ్చి, ఉత్సాహమిచ్చి, శ్రీశ్రీ చనిపోయిన నాటి నుండి నేటి వరకూ మాకుటుంబాన్ని – అవసరానికి ఆదుకుంటూ, ఈ పుస్తక ముద్రణకి – సహకరించిన విశాలాంధ్ర ప్రచురణాలయంవారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ ఉద్యమంలో నాతో మీరందరూ సహకరించి – నాకు చేయూతనిచ్చి ప్రోత్సహిస్తారన్న నమ్మకంతో.....

తెలుగు సంవత్సరాది, 1995<br>మ ద్రా సు.

మీ<br>సరోజా శ్రీశ్రీ

# నా మాట*

ఎట్టకేలకు "శ్రీశ్రీ ప్రచురణలు" ప్రారంభిస్తున్నాను. "ఈ పని ఎప్పుడో జరగవలసిం" దన్నారు మిత్రులు "Better late than never" అనుకున్నాను నేను.

ఇకమీద నా పుస్తకాలన్నీ (ఇదివరకు రాసినవీ, ఇక ముందు రాయబోయేవీ) నేనే ప్రచురించదలుచుకున్నాను. వాటిని "శ్రీశ్రీ లైబ్రరీ" ద్వారా పాఠకులకు నేనే అందజేయబోతున్నాను.

ఈ సినిమా పాటలు గ్రంథరూపంగా వెలువడటానికి కొందరు విస్పన్న పేట సహృదయులు (ముఖ్యంగా సంకలనకర్త) కారణం. వారందరికీ నా కృతజ్ఞత.

*

ఈ పుస్తకాన్ని అచ్చువెయ్యడంలో శ్రద్ధా, శ్రమా తీసుకున్న "స్వాతి" అధిపతి వేమూరి బలరామ్‌గారికి, అలంకారాలు సమకూర్చిన ఆర్టిస్టు టీ.వీ. గారికీ నా కృతజ్ఞత.

ఈ ఉద్యమంలో నాతో సహకరిస్తున్న స్నేహితులందరికీ నా కృతజ్ఞత.

శ్రీశ్రీ

మద్రాసు,

4 - 2 - 83

* తొలి ముద్రణకు

# ఇందులోని పాటలూ, పద్యాలూ ......

# పాడవోయి భారతీయుడా

పాడవోయి భారతీయుడా – ఆడి
పాడవోయి విజయగీతికా॥

నేడే స్వాతంత్ర్యదినం
వీరుల త్యాగఫలం
నేడే నవోదయం – నీదే ఆనందం ॥

స్వాతంత్ర్యం వచ్చెననీ సభలే చేసి
సంబరపడగానే సరిపోదోయి
సాధించినదానికి సంతృప్తిని పొంది
అదే విజయమనుకుంటే పొరపాటోయి

ఆగకోయి భారతీయుడా – కదలి
సాగవోయి ప్రగతిదారుల ॥

ఆకాశం అందుకొనే ధరలొకవైపు
అదుపులేని నిరుద్యోగమింకొకవైపు
అవినీతి, బంధుప్రీతి, చీకటి బజారు
అలముకొన్న నీదేశం ఎటు దిగజారు?

కాంచవోయి నేటి దుస్థితి – ఎది
రించవోయి ఈ పరిస్థితి ॥

పదవీ వ్యామోహాలు, కులమతబేధాలు
భాషాద్వేషాలు చెలరేగె నేడు

ప్రతి మనిషి మరియొకని దోచుకొనేవాడే
తన సౌఖ్యం, తన భాగ్యం చూచుకొనే వాడే

స్వార్థమే అనర్థకారణం – అది
చంపుకొనుటె క్షేమదాయకం ॥

సమసమాజ నిర్మాణమె నీ ధ్యేయం
సకలజనుల సౌభాగ్యమె నీలక్ష్యం
ఏకదీక్షతో గమ్యం చేరిననాడే
లోకానికి మన భారతదేశం
అందించునులే శుభ సందేశం ॥

ఇది అన్నపూర్ణా పిక్చర్స్ "వెలుగు నీడలు" లోనిది. స్వర కల్పన పెండ్యాల. పాడినవారు ఘంటసాల.

ఆ రోజుల్లో సినిమా కవులం తరచు ట్యూనుకి మాటలు పొదుగుతూ వుండేవాళ్ళం. కానీ, ఈ పాట నేను రాసిన తరువాత పెండ్యాల ట్యూన్ చేశాడు. అన్ని చరణాలు త్రిశ్రంలో ఉండగా, ఆఖరిది మాత్రం చతురశ్రంలో వుండడం గమనార్హం. నేను మారుస్తానంటే వద్దని, తానే గతి మార్చి ట్యూన్ చేశాడు పెండ్యాల. అందుకే నేననేవాణ్ణి : "ఆంధ్ర పత్రిక" ఎడిటోరియల్ నుంచి ఒక చిన్న వాక్యం ఇచ్చినా, దాన్నికూడా పెండ్యాల చక్కగా ట్యూన్ చెయ్యగలడని!

నా సినిమా పాటల సంపుటిని "అల్లూరి సీతారామరాజు" లోని "తెలుగు వీర లేవరా" అనే పాటతో ప్రారంభిస్తే బాగుంటుందనే సూచన ఒకటి వుంది. నిజమే. ఆ పాట బహు జనాదరణ పొందింది. దానికి జాతీయ స్థాయిలో ప్రెసిడెంట్ అవార్డు లభించింది. ఈ బహుమతి విలువ 5వేల రూపాయలు. మొదట 10వేలు అని ప్రకటించి తర్వాత అయిదుకి తగ్గించారు. సరే, అదే పదివేలనుకొని ఫక్రుద్దీన్ అహ్మద్‌గారి చేతిమీదుగా అవార్డు అందుకున్నాను. ఐతే అది వెయ్యేసి రూపాయల విలువ చేసే అయిదు నేషనల్ సర్టిఫికేట్లున్న కవరు. ఏడు సంవత్సరాలకి ఏడెనిమిది వేల దాకా వడ్డీతోసహాపండుతుందట. అంతకాలం ఆగే ఓపిక లేక స్టేట్ బ్యాంక్‌లో ఆ పత్రాలు తాకట్టు పెట్టి 3వేలు తెచ్చుకొన్నాను. తీసుకురావడం, ఖర్చుపెట్టెయ్యడం, అప్పు తెచ్చానన్న సంగతి మరచిపోవడం కూడా జరిగాయి. నేను మరచిపోతే గవర్నమెంటు మరచిపోతుందా? 5 ఏళ్ళ తర్వాత ఒక నోటీసు పంపింది, అసలు ఫాయిదాలతో సహా సుమారు 10 వేల దాకా చెల్లించమని ! కిందా మీదా పడి ఎలాగో దఫ దఫాలుగా సర్కారు ఋణం తీర్చుకున్నాను.

ఆ తర్వాత మళ్ళీ ఏ సినిమా పాటకూ జాతీయ బహుమతి వచ్చినట్టులేదు. "తెలుగువీర లేవరా" అనే పాటతో ఈ సంపుటిని మొదలుపెట్టకపోవడానికో చిన్న కారణం వుంది.

అందులో –

"ప్రతిమనిషీ తొడలు గొట్టి....

సింహాలై గర్జించాలి......" అనడంలో వ్యాకరణదోషం వుంది. (ప్రతిమనిషి ఏక వచనం, సింహాలై బహువచనం. సింహంలా గర్జించాలి అంటే సరిపోతుంది, సాహిత్యరీత్యా మాత్రమే కాక సంగీతపరంగా కూడా.)

నా సినిమా పాటలూ, పద్యాలూ ఒక సంపుటంతో ముగిసేవి కావు. వచ్చే సంపుటి "తెలుగువీర లేవరా" అనే పాటతోనే ప్రారంభమవుతుంది. గ్రంథ శీర్షికకూడా అదే.

అందులో, "సింహంలా గర్జించాలి " అనే సవరణ ఉంటుంది. సినీమా పాటల్లో పెద్దపెద్ద దూడలకే ఎవరూ కేర్ చెయ్యరని నాకు తెలుసు. నేను చేస్తాను.

పానుగంటివారి "కంఠాభరణం" నాటకంలోని జంటకవులలో ఒకడు, "ఆశుకవిత-యొకటి, ఆవుపేడయొకటి స్వయముగానే శుద్ధ చయము భువిని" అంటాడు. సినీమా పాటనుకూడా ఈ శుద్ధచయంలో చేర్చుకోవచ్చుననుకుంటాను.

# ప్రేమయే జనన మరణ లీల

ప్రేమయే జనన మరణ లీల
మృత్యుపాశమే అమరబంధమౌ
యువప్రాణుల ప్రోాల ॥

ఆకాశమె చేరువయ్యె తోచె
అలలే పొంగి హాయిగ వీచె
జీవితమంతా ఒకే పాటగా
ఎప్పటికీ మనమే ॥

మధుర మధురతరమైన వాంఛలే
హృదయ సదనమును పరిపాలించె
సుకృతజన్మము మాదే సఫలం
సుఖమే ఏ వేళ ॥

తను సాంగత్యము త్రుటియేకాదా
నిలుచు దృఢముగా మానసగాథ
మృత్యుపాశమే అమరబంధమౌ
యువప్రాణుల ప్రోాల ॥

* * *

సినీమాకు నేను రాసిన పాటలన్నింటిలోనూ ఇది మొట్టమొదటిది. ట్యూన్‌కి మాత్రమేకాక పెదవుల కదలికకుకూడా సరిపోయే విధంగా "నీరా ఔర్ నందా" అనే హిందీ చిత్రానికి రాసిన డబ్బింగ్ పాట ఇది. తెలుగులో "ఆహుతి" అనే పేరుతో ఈ చిత్రం విడుదల అయింది. అంతకు ముందు చాలా కాలం కిందటనే "కాలచక్రం" అనే చిత్రంలో నా "మహాప్రస్థానం" పాట వచ్చింది. కాని అది సినీమా కోసం రాసింది కాదు.

"ఆహుతి" చిత్రం ఆర్థికంగా ఫెయిల్ అయింది. అయితేనేం అందులోని పాటలు చాలా బాగున్నాయని పేరు వచ్చింది. అది విని హెచ్.యం. రెడ్డిగారు అప్పటికి పూర్తి కావస్తున్న తమ "నిర్దోషి" చిత్రానికి రచయితగా నన్ను తీసుకున్నారు. ఆ తర్వాత తెలుగు నిర్దోషి, తమిళ నిరపరాది బ్రహ్మాండమైన విజయాలు సాధించడంతో రెడ్డిగారు రోహిణీ స్టూడియో నిర్మించి నన్ను నెలకు 300 రూపాయల పారితోషికం (దానిని జీతం అనడానికి వీల్లేదు) మీద పెర్మనెంటు రచయితగా తీసుకున్నారు. ఆ విధంగా సినీ పరిశ్రమలో స్థిరపడడం జరిగింది.

"ఆహుతి" లోని పాటలన్నీ బాగున్నాయంటే అందుకు సాలూరు రాజేశ్వరరావు సంగీతం గొప్పగా తోడ్పడిందని చెప్పక తప్పదు. హిందీ ఒరిజినల్‌లోని ట్యూన్లన్నింటినీ అతడు పూర్తిగా మార్చి తన సొంత ముద్ర వేశాడు. కొన్ని సందర్భాలలో ఒకే పాటకు మూడు నాలుగు రకాలుగా ట్యూన్ చేసి అందరికీ నచ్చిన దాన్ని ఖాయం చేయడంకూడా రాజేశ్వరరావు ప్రత్యేకత. అన్నింటిలోనూ "ప్రేమయే జనన మరణ లీల" అన్న పాట ఇప్పటికీ ఘంటసాలవారి మధుర కంఠంతో మన రేడియో కేంద్రాలనుంచి తరుచూ ప్రసారితమవుతూనే వుంది.

సినిమాకు పాటలు రాయటం చాలామంది అజ్ఞానులనుకునేటంత సులభం కాదు. ఇక డబ్బింగుకు రాయడమనేది మరీ కష్టంతో కూడుకున్న పని. ఉదాహరణకు: "ప్రేమయే" అన్న పాటనే తీసుకుందాం. హిందీలో దీని పల్లవి – "ప్రేమ్ హై జనమ్ మరణ్ కాఖేల్". ట్యూన్ ప్రకారం ఇది "ప్రేమ్ హై – జనమ్ మరణ్ – కాఖేల్" అని విరుగుతుంది. ఇందులోని ఆఖరి "కాఖేల్" చాలా యిబ్బంది పెట్టింది. "ప్రేమయే జనన మరణ ఖేల" (గాధ, క్రీడ) అని రాశాను. గాని "లీల" అనే మాట మొదట్లో స్ఫురించలేదు. అరాత్రి కలత నిద్రలో రాజేశ్వరరావు ట్యూను మననం చేసుకుంటూ వుంటే "ప్రేమయే జనన మరణ లీల" అనే పల్లవి దొరికింది. మర్నాడు పాటంతా పూర్తి చేశాను.

# కళయే నవ కళయే

కళయే నవకళయే
మంగళమౌ రసానంద సామ్రాజ్యము
మధుమాధురీ సలలితము ॥
పావన సౌందర్యమే – మన
జీవన సౌభాగ్యమై
జగముల వెలిగించి
వగపుల తొలగించి
మురిపెము లూరించి
మోక్షపథమున నడుపును
రాజిత కవిరాజులే – వాణీ
పదముల పూజించగా
తియ్యని మృదుగీతి దిశలెల్ల వ్యాపించి
సుమరాజి వనసీమ పులకించగా
మోదభరితమై నాదం సుధయై వరలును
మద గరిగ ఝుంతకిట
యని గీతా రసధుని స్వర
ఝరి దాసగరిగధింతకిట
తానం ధ్వనించి పరవశముగా
హృదయమె వెలయగ తోం తధిగిణతోం
ధిత్తం రిసరిగ రిగమపా లయ వెలయ ॥

ఈ పాట నా జ్ఞాపకాలను 20 సంవత్సరాల వెనక్కు తీసుకు వెళుతోంది. ఇది మూనాస్ అనే కోటీశ్వరుడు నిర్మించిన ద్విభాషా చిత్రంలోనిది. "ప్రపంచం" అనే పేరుగల తెలుగు చిత్రానికి రెండు మూడు డజన్ల పాటలు, దస్త్రాలకొద్దీ కాగితాల మీద డైలాగులూ రాసివుంటాను. (ఒక పాటమాత్రం ఆరుద్రచేత రాయించాను) దీని నిర్మాణానికి 30 లక్షలు (బహుశా అంతకన్నా ఎక్కువ) రూపాయలు ఖర్చయింది. నాకు నెలకు 200 రూపాయలు (జీతం కాదు) పారితోషికం.

ఆ రోజులే ఎంతో బాగుండేవి. నెలనెలా ఏడో తేదీని 300 రూపాయలకి హెచ్.యం. రెడ్డిగారి చెక్కూ, 21వ తేదీని సొసైటీ పిక్చర్సువారి 200 రూపాయల చెక్కూ చేతికందేవి. ఇతర చిత్రాలకు రాయకూడదనే నియమాలేవి రెడ్డిగారుగాని, మూనాస్‌గాని నామీద విధించలేదు.

తెలుగు, తమిళ చిత్రాలు రెండూ ఫెయిల్ అయాయి. అయినా మూనాస్, స్టార్ కంబైన్స్ స్టూడియోను కొనివేసి, అయిదు భాషల్లో "దేవసుందరి" చిత్రాన్ని నిర్మించాడు. దీనికి తెలుగు రచయితగా నాకు వెయ్యిన్నూటపదార్లు ముట్టచెప్పాడు.

"ప్రపంచం" పాటల పుస్తకం ఎక్కడయినా దొరికితే బాగుండును. ఒక పాటలో –

"బండికి ఉండేటి రెండు చక్రాల్లాగ<br>
తాపీగా సాగాలి సంసారం<br>
కొరడాతో తోలేటి కరమం లేకుండానె<br>
సాఫీగా సాగాలి సంసారం "

అని రాశాను. తాపీ ధర్మారావు, తోలేటి వెంకటరెడ్డిగార్లు అనాటి ప్రసిద్ధ సినీమా కవులు.

మరో చిన్న విశేషం. వెండితెరమీద సుమారు రెండున్నర నిమిషాలపాటు ఈ చిత్రంలో నేను కనబడతాను, సర్కస్ ఎనౌన్సర్‌గా!

# ఉన్నవారికే .....

ఉన్నవారికే అన్ని సుఖాలోరయ్యో రయ్యో
లేనివారిగతి ఈ లోకంలో నుయ్యో గొయ్యో
ఎవరికివారే యమునా తీరే అన్నా అన్నా
ఇల్లూ వాకిలి నీదీ నాదీ సున్నా సున్నా

//అయ్యో....అమ్మో....//

కోటి విద్యలు కూటి కోసమే రామా రామా
పాటులేక సాపాటు లేదురా మామా మామా
తెలివి తేటలకు విలువేలేదు
కలికాలంలోన
కలిమీ బలిమీ రాజ్యం చేస్తాయ్
తానా తందానా

//అయ్యో....అమ్మో....//

ప్రపంచమంతా పైసా కోసం
ఒకటే ఆరాటం - ఓబాబు
ఒకటే ఆయాసం
పైసాశక్తి పైసా ముక్తి కాసే కైలాసం

//అయ్యో....అమ్మో....//

ఈ పాట "ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్" వారి మొట్ట మొదటి చిత్రం "పెంపుడు కొడుకు" లోనిది ఆ రోజుల్లో ప్రొడ్యూసర్లు ఒక చిత్రంలో పాటలన్నిటికీ ఒకే రచయితను నియమించేవారు. అలాగే ఈ చిత్రంలో పాటలన్నీ నేనే రాశాను.

అనిసెట్టి రాసిన "భయం భయం బ్రతుకు భయం" అనే పాటను నా అనుమతి పొంది, చిత్రంలో ఉపయోగించుకున్నారు.

ఈ పాటకు సంగీత దర్శకుడు రాజేశ్వరరావు బాణీకడుతున్నప్పుడు కిటికీ వెలుపల ఎందరో జనం పోగయి ఎంతో ఆసక్తితో వింటూండేవారు.

నటి రాజసులోచనకు ఈ పాటతోనే సినీరంగ ప్రవేశం. ఏరు వాక పాటతో వహీదా రహ్మాన్‌కు వలె రాజసులోచన ఈ చిత్రంలో ఒక పేద వీధి నర్తకి.

# వినరాని మాటలే

వినరాని మాటలే విన్నావా
కనరాని చేతలే కన్నావా
అనుకోని ఆరడికి అదిరిపోయావా
ఇలువీడి జాలిగా కదలిపోయావా ॥

అనురాగమే నశించి
అవమానమే దహించి
నవనీత హృదయమే కరిగినదా ॥

తెల్లని నల్లని గళ్ళ తతంగం
జీవితమే ఒక చదరంగం
పావులేకదా జీవులందరూ
తెలియనిదీ ఆట
కనబడదొక బాట ॥

చీకటి వెన్నెల చీలు దారిలో
బండి చక్రముల బ్రతుకీడుస్తూ
ఎంత దూరమో ఎంత భారమో
ఎరుగనిదీ గమనం!
ఏ దెసకీ పయనం ॥

* * *

శర్వాణీ పిక్చర్స్ వారి "అక్కా చెల్లెళ్లు" చిత్రంలోనిదీ పాట. ప్రారంభంలో దీనికి పూర్తి సలహాదారును నేనే! పావలా వాటాతో నాకు ప్రొడ్యూసరు హోదా ఇవ్వడానికి కూడా అంగీకారం కుదిరింది. అయితే అలా ఎందుకు జరగలేదో చెప్పాలంటే అందుకు ప్రత్యేకంగా ఒక పుస్తకమే రాయవలసి ఉంటుంది.

కావాలనుకుంటే ఈ చిత్రానికి నేనే డైరక్టరునయి ఉందును. కాని ఒక పిక్చరుకు దర్శకత్వం వహించాలంటే ఇరవైనాలుగ్గంటలూ దానికే అంకితమయి వుండాలని నమ్మే తత్వం నాది. ఆ రోజుల్లో నాకు డబ్బింగు పిక్చర్లుండేవి. అంచేత ఆ పిక్చరును డైరెక్టుచేసే అవకాశం, మద్రాసు వదలి వెళ్ళిపోయిన ఒక అసిస్టెంటు డైరెక్టరుకి ఉత్తరం రాసి పిలిపించి మరీ ఇచ్చాను.

# దత్తపది

అప్పుడు మిధిలకు జని నే
నిప్పుడు కావించు వింత నిచ్చటి ప్రజ తా
మెప్పుడును కాంచబోరని
చెప్పుచు రాఘవుడు విరిచె శివకార్ముకమున్.

పద్యమేమో చిన్నదే. "కుమ్మరి మొల్ల" సినిమాలోనిది. దీన్ని రాయడానికి అయిదునిమిషాలకంటె ఎక్కువసేపు పట్టలేదు. కాని దాని గురించి వివరణ కాస్త విపులంగానే ఇవ్వవలసి ఉంది.

"కుమ్మరి మొల్ల" చిత్రంలో ప్రొడ్యూసరు పద్మనాభానిది తెనాలి రామలింగని పాత్ర. కవయిత్రి మొల్ల కవితా పాటవాన్ని పరీక్షించడానికి రాయలవారు పంపగా వస్తాడు తెనాలి రామలింగ కవి. ఈ కవితా పరీక్ష ఎలా వుండాలి. ఏదో ఒక చిన్న సమస్య యిచ్చి పూరించమంటేనో?

"కులటన్‌గని చీరి శ్యామ కురులల్లమనెన్ " అని చిన్నప్పుడెప్పుడో నేను విన్న సమస్యను

"కులటన్‌గని చీరి మొల్ల
కురులల్లమనెన్
అని మార్చి.... మొగలిరే
కులటన్ గని చీరి మొల్ల
కురులల్లమనెన్"

* * *

అని పూరించినట్లుగా ఒక పద్యం రాశాను. బాగానే వుందిగాని ఇంకా జటిలమైన పరీక్ష అయితే బాగుంటుంద.స్న [illegible] .. పచ్చింది. అందుకుగాను ఈ దత్తపది ఆలోచించాను.

"అప్పు, నిప్పు, మెప్పు, చెప్పు," అని నాలుగు మాటలిచ్చి, రామాయణపరంగా అర్థం వచ్చేటట్లు ఒక పద్యం చెప్ప మంటాడు కుమ్మరి మొల్లను రామలింగడు. "సరే అలాగే అని ఆమె పద్యం చెప్పబోయేసరికి మరో షరతు విధిస్తాడు. "నా పద్యంలో అప్పు అంటే ఋణం, నిప్పు అంటే అగ్ని, మెప్పు అంటే ప్రశంస, చెప్పు అంటే పాదరక్ష అనే అర్థాలు రాకూడదు." ఇప్పుడు చెప్పు అంటాడు రామలింగడు. అతడు విధించిన

నియమాలను ఉల్లంఘించకుండా కవయిత్రి మొల్ల చెప్పినట్లుగా పై కంద పద్యం రాసి యిచ్చాను.

అంతవరకే పిక్చరులో వుంటుంది కాని ఈ పరీక్షను ఇంకా సాగదీయవచ్చు. "చాలా తేలికగా ఒక కందపద్యం చెప్పేశావు గాని ఇదే అర్థంతో ఒక ఉత్పల మాల చెప్పు అమ్మాయి" అని రామారావుగారు అడిగేడనుకుందాము. అప్పుడామె చెప్పే పద్యం —

అప్పుడు ఖ్యాతి గన్న మిథిలాఖ్య పురంబును చేరనేగి, నే
నిప్పుడు చేయు వింత నెవరేనియుజీవిత కాలమందు తా
మెప్పుడుగాని చూడరని యెంతయు సంతసమార, ధీరుడై
చెప్పుచు రాఘవుండు విరిచెన్ శివకార్ముక మద్భుతంబుగన్.

# పయనించె

పయనించె మన వలపుల
బంగరు నావ
శయనించవె హాయిగా
జీవనతార, నా
జీవనతార ॥

నెలబాలుని చిరునవ్వుల
తొలివెన్నెల సోనలలో
చెలరేగే అలలమీద ఊయలలూగి ॥

వికసించే విరజాజులు
వెదజల్లగ పరిమళాలు
రవళించే వేణుగీతి రమ్మని పిలువా

ఇది పి. ఎ. పద్మనాభారావు నిర్మించిన, డైరక్టు చేసిన "బావా మరదళ్ళు", చిత్రంలోనిది. ప్రారంభంలో ఆనందకరంగా వినిపించే ఇదే పాట కొంత కథ సాగిన పిమ్మట విషాదంగా వినబడుతుంది. సంగీత దర్శకుడు పెండ్యాల.

# ఒక హరికథ

శ్రీ నగజా తనయం సహృదయం
చింతయామి సదయం
త్రిజగన్మహోదయం
శ్రీ నగజా తనయం

వచనం : శ్రీ రామ భక్తులారా! ఇది సీతాకళ్యాణ సత్కథ. నలభై రోజులనుండి చెప్పిన కథ చెప్పిన చోట చెప్పకుండా చెప్పకొస్తున్నాను. అందుచేత కించిత్తు గాత్ర సౌలభ్యానికి అభ్యంతరం ఏర్పడినట్లు తోస్తోంది. నాయనా కాస్త పాలు, మిరియాలు !

కోరస్ : చిత్తం. సిద్ధం.

వచనం భక్తులారా! సీతామహాదేవి స్వయంవరానికి ముల్లోకాల నుంచి విచ్చేసిన వీరాధివీరులలో అందరినీ ఆకర్షించిన ఒకే ఒక దివ్యసుందరమూర్తి ఆహా, అతగాడెవరయ్యా అంటే –

పాట : రఘురాముడు
రమణీయ వినీల ఘనశ్యాముడు
వాడు, నెలరేడు, సరితోడు, మొనగాడు,
వాని కనులు మగమీల నేలురా
వాని నగవు రతనాల జాలురా
వాని చూచి మగవారలైన మైమరచి
మరులుకొనెదరు మరోమరుడు, మనోహరుడు ॥

వచనం : ఆ ప్రకారంగా విజయం చేస్తున్న శ్రీరామచంద్రమూర్తిని అంతఃపుర గవాక్షం నుండి సీతాదేవి ఓరకంట చూచినదై చెంతనున్న చెలియతో –

పాట : ఎంత సొగసుకాడే మన
సింతలోన దోచినాడే
మోము కలువ రేడే నా
నోము ఫలము వీడే
శ్యామలాభిరాముని చూడగ
నా మది వివశమాయె నేడే ॥

వచనం : ఇక్కడ సీతాదేవి ఇలా పరవశమై యుండగా, అక్కడ స్వయంవర సభామంటపంలో జనక మహీపతి సభాసదులను చూచి –

పాట : అనియనిట్లు, ఓ అనఘులారా నా అనుగుపుత్రి సీత
వినయాదిక సద్గుణ వ్రాత, ముఖవిజిత చకిత జలజాత
ముక్కంటి వింటి నెక్కిడ జాలిన ఎక్కటి జోదును నేడు
మక్కువ మీరగ వరించి మల్లెల మాలవైచి పెండ్లాడు !

వచనం : అని యీ ప్రకారం జనక మహారాజు ప్రకటించగానే సభలోనివారందరూ ఎక్కడివారక్కడ చల్లబడిపోయారుట, మహావీరుడైన రావణాసురుడు కూడా "హా! ఇది నా ఆరాధ్యదైవమగు పరమేశ్వరుని చాపము! దీనిని స్పృశించుటయే మహాపాపము" అని అనుకొనినవాడై వెనుతిరిగి పోయాడట. తదనంతరమున –

పాట : ఇనకుల తిలకుడు నిలకడ గల క్రొ
క్కారు మెరుపువలె నిల్చి
తనగురువగు విశ్వామిత్రుని ఆ
శీర్వాదము తలదాల్చి
సదమల మదగజ గమనముతోడ స్వ
యంవర వేదిక చెంత
మదన విరోధి శరాసనమును తన
కరమున బూనిన యంత

గీతపద్యం : పెళ్ళుమనె విల్లు గంటలు ఘల్లుమనె, గు
భిల్లుమనె గుండె నృపులకు, ఝల్లుమనియె
జానకీ దేహమున్ నిమేషంబునందే
నయము జయమును భయము విస్మయముగదుర !
శ్రీమద్రమారమణ గోవిందో హరి !

వచనం : భక్తులందరూ చాలా నిద్రావస్థలో ఉన్నట్టుగా వుంది. మరొక్కసారి జై శ్రీమద్రమారమణ గోవిందో హరి ! భక్తులారా ! అవిధంగా శ్రీరామచంద్రమూర్తి శివదనుర్భంగము గావించినాడు. అంతట –

కంద పద్యం: భూతల నాథుడు రాముడు
ప్రీతుండై పెండ్లియాడె పృథుగుణ మణి సం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ –

కందార్థం : భూతలనాథుడు రాముడు ప్రీతుండై పెండ్లియాడె శ్రీ మద్రమారమ
ణగోవిందో హరి !

ఈ హరికథ ఆత్రేయ డైరెక్టు చేసిన మొట్టమొదటి, చిట్టచివరి చిత్రం "వాగ్దానం" లోనిది. తాను స్వయంగా రాయగలిగి ఉండిన్నీ నాచేత తన చిత్రంలో పాటలు రాయించిన ఆత్రేయకు నా కృతజ్ఞతలు తెలుపుకోవలసి వుంది.

కృతజ్ఞతతోపాటు ఒక క్షమాపణను కూడా ఈ సందర్భంలో చెప్పుకోవలసి ఉంది. అది ఏమిటి, ఎవరికి?

పాటల పుస్తకం చూస్తే మొత్తం హరికథ అంతా నాదే అని పాఠకులు పొరపడే అవకాశం ఉంది. కాని, కథాప్రారంభంలోని వినాయక స్తోత్రం సంప్రదాయసిద్ధంగా మన హరిదాసులు ఆలాపించే సంస్కృత శ్లోకం. దాన్ని ఎవరో ప్రాచీనకవి రచించి ఉండాలి. అలాగే ఆఖరి కంద పద్యం బమ్మెర పోతనామాత్యుని శ్రీమదాంధ్రమహాభాగవతం లోనిది రెండు సుప్రసిద్ధ రచనలేకాబట్టి ఇవి నేను రాసినవని చదువుకున్నవారెవరూ అపార్థంచేసుకోరు. ఇకపోతే "ఫెళ్ళు మనె విల్లు ....." అనే గీత పద్యం కరుణశ్రీగారిది. వీరి అనుమతితోనే దీనిని వాడుతున్నట్లు ఆత్రేయ నాతో చెప్పినప్పటికీ పుస్తకంలో ఆమాట చెప్పకపోవటం పొరపాటే. ఇది ఎవరి కారణంగా జరిగినప్పటికీ తప్పు తప్పే కాబట్టి ఇందుమూలంగా జంధ్యాల పాపయ్య శాస్త్రి (కరుణశ్రీ) గారికి నా క్షమాపణ తెలియబరచుకుంటున్నాను.

# ఎవరివో నీవెవరివో

ఓ సజీవ శిల్ప సుందరీ
నా జీవనరాగ మంజరీ
ఎవరివో నీ వెవరివో
ఎవరివో ఎవరివో
నాభావనలో నాసాధనలో
నాట్యం చేసే రాణివో ॥

దివినే వదలి భువికేతెంచిన
తేనెల వెన్నెల సోనవో
కవితావేశము కలలై అలలై
కురిసిన పూవుల వానవో ॥

నవ వసంతమున నందనవనమున
కోయిల పాడిన పాటవో
వలపు కొలనులో కలకల విరిసిన
కలువల కన్నుల కాంతివో ॥

నీకర కంకణ నిక్వణమా – అది
వాణీ వీణా నినాదమా
నీ పద నూపుర నిస్వనమా – అది
జలధి తరంగ మృదంగ నాదమా

రావే మోహన గీతమా
రావే నూతన తేజమా
రావే రావే

చిత్రం "పునర్జన్మ." సంగీత దర్శకుడు తాతినేని చలపతిరావు. దరిమిలాను ఈ పాటకు రకరకాల అనుకరణలు వచ్చాయిగాని తెలుగు సినిమాలో అది సర్వ సాధారణం. కథలో సంఘటనలు మొదలుకొని, కండగల డైలాగులూ, రుచిగల పాటల భాగాలు దాకా ఎన్నెన్నో వెనకటి చిత్రాల లోనివిప్పుడు పునర్దర్శనం ఇస్తూనే ఉన్నాయి. పాత ట్యూను ఎందుకు కాపీ కొట్టావని అడిగితే, మంచి అనేది ఎక్కడ ఉన్నా తీసుకోవాలని పెద్దలు

చెబుతూ ఉంటారు. కాబట్టి ఇంత మంచి ట్యూను మరుగున పడి పోవటం ఇష్టం లేక దీన్ని సొంతం చేసుకున్నానన్నాడట లోగడ ఒకాయన.

ఏది ఎలా వున్నా "పునర్జన్మ" చిత్రం బెంగుళూరులో ఆడుతున్నప్పుడు ఆ పాటకోసమే వెళ్లి, ఇది అయిపోగానే తిరిగి వచ్చేసే వాడిననీ, ఇలా సుమారు ఇరవై సార్లైనా జరిగి ఉంటుందని ఒక కన్నడ వ్యక్తి నాతో అన్నాడు.

# వీణ పాట

ఏమని పాడెదనో ఈ వేళ
మానసవీణ మౌనముగా నిదురించిన వేళ॥

జగమే మరచి హృదయ విపంచి
గారడిగా వినువీధి చరించి
కలత నిదురలో కాంచిన కలలే
గాలి మేడలై కూలినవేళ॥

వనసీమలలో హాయిగ ఆడే
రాచిలుకా నిను రాణిని చేసే
పసిడి తీగల పంజరమిదుగో
పలుక వేమని పిలిచే వేళ ॥

ప్రసాద్ ఆర్ట్స్ "భార్యా భర్తలు" చిత్రంలో ఈ వీణ పాట ఆ తర్వాత వచ్చిన ఎన్నో చిత్రాలకు వరవడి పెట్టింది. కేవలం వీణ పాట ప్రవేశ పెట్టడానికే ప్రత్యేక సన్నివేశాలు సృష్టించిన సందర్భాలు కూడా కోకొల్లలు.

# ఒక పద్యం

హృదయమిదే హరించెను క
　　దే సఖి రూపము శక్రచాపమో
వదనము వారి జాతమొ సు
　　వాసన లీనెడు పారిజాతమో
కుదురగు శ్రోణి అందమగు
　　క్షోణియొ వేణి చలత్త్రివేణియో
మదనుని దంతియో చెలియ
　　మల్లెల దొంతియొ వైజయంతియో

ఈ పద్యం ఏ చిత్రంలోనిదో జ్ఞాపకంలేదు. అయితే దాని డైరెక్టరు సి. రంగనాధదాసని తెలుసు. డైరెక్టరు సూచనల ననుసరించి ఏవేవో మార్పులు చెయ్యడం వల్ల చిత్రంలోని పద్యం పై విధంగా ఉండదు. మీదనిచ్చిన పద్యం నాకు నచ్చినదీ, మొదట్లో నేను రాసినదీ.

# శ్రీ 420

శ్రీ ఫోర్ - టూ - జీరో
వీరే మా హీరో
పగలు పెద్దమనిషి
రాత్రి చెడ్డమనిషి
పగటినే రాత్రిగా మార్చివేస్తారు.
మట్టి పూస్తారు,
మాయ చేస్తారు.॥

ఏమిలోకమిది ఎంత మోసమిది
మనిషికీ మంచికీ విలువపోయినది.
పరువు పోయినదీ బ్రతుకు మారినది

అధికారం వీరికి కత్తి
అపకారం వీరికి వృత్తి
కొంచెం చెయి తడిసిందంటే
కొట్టేస్తారందరి నెత్తి
సరుకంతా దాచేస్తారు
చీకట్లో అమ్మేస్తారు
దేశాన్నే యిరుకున పెట్టి
సిరులన్నీ దోచేస్తారు.
లాలాలా - మసాలా
సాసాసా కులాసా ॥

నాగరికం పెరిగి, సీమరుచులు మరిగి
తిరుగుతారు వీరు
ఒళ్ళు దాచుకోరు
వంపు సొంపు నీటు గోటు
చూడ రెండు కళ్ళు చాలునా?
బాబాబా మతాబా
టాటాటా గలాటా ॥

* * *

గిడుతూరి సూర్యం డైరెక్టు చేసిన "సంగీతలక్ష్మి" అనే చిత్రంలోనిదీ పాట. మ్యూజిక్ డైరెక్టరు సాలూరు రాజేశ్వరరావు. ఇటువంటి గలాటా పాటలకు కూడా చక్కని సంగీతం అందించగలగడం అతని సర్వతోముఖ ప్రతిభకు తార్కాణం.

# కృష్ణార్జున సంవాదం

కృష్ణుడు : ఔరౌర ఐదుగురన్నదమ్ములు మీర
లోక కాంత పొందు పంచుకొనలేదె

అర్జునుడు : పదియారువేల గోపవధూజనాల సాం
గత్యంబు కంటెను నయము కాదె

కృ : గురు దక్షిణార్థ మంగుష్ఠ ఖండన పేర
ఏకలవ్యుని మోసగించ దగునె

అ : అప్యాయముగ పిల్వనం పిన మామనే
సంహరించుట నీతి శాస్త్ర మగునె

కృ : నాగకాంత ఉలూచి భోగ సంపద చూచి
వ్రతదీక్షకే నీళ్ళు వదలవలెనె

అ : అక్రమంబనక త్రివక్రయౌ కుబ్జతో
కేళీకలాపాల తేలవలెనె

కృ : ఉచ్చమో నీచమో ఉంఛవృత్తి వహించి
ఎగ్గులెన్నక బిచ్చమెత్తదగునె

అ : నీవు చూపిన దారినే నడచిన మాకు
భిక్షాటనము క్రొత్త విద్యయగునె

కృ : వాలకము లేల పార్థ నా పలుకు వినుము,
గయుని విడనాడి చనుము సుఖమ్ము గనుము

అ : నాటకములేల కృష్ణ నా మాట వినుము
గయుని రక్ష అదే నా అఖండ దీక్ష

కృ : అర్జునా సిగ్గుమాలిన దుర్జనా మ
దీయ చక్రాయుధమ్ము వధించు నిన్ను

అ : మాధవా వెర్రి బాగుల యాదవా మ
దీయ పాశుపతాస్త్రమే త్రెంచు నిన్ను

ఇదికూడా "సంగీతలక్ష్మి" చిత్రంలోనిదే! "సంగీతలక్ష్మి" లోని "గయోపాఖ్యానం" లోని కృష్ణార్జున సంవాదం ఇది. చిలకమర్తి వారి "అల్లుడా రమ్మని...." బాణీలో రాసిన పద్యం.

పద్యం తెలుగువాడి ప్రత్యేకత. గోంగూర పచ్చడిలాగ, ఆవకాయలాగ మన స్టేజినటులు పద్యపఠనను మహోన్నత స్థాయికి తీసుకువెళ్ళారు.

పాటలో సాహిత్యాన్ని సంగీతం మింగేసే ప్రమాదం వుంది. సినిమా పాటల్లో ఇది మరీను. అందుకే కొందరు సాహితీపరులకు సినిమా పాటలంటే ఎంతో తృణీకార భావం. అందుకు తగ్గట్టుగానే చాలామంది ప్రొడ్యూసర్లు పాపమీ ప్రేక్షకుల్ని రంజించవలసివుందనే సాకుతో చవకబారు పాటలు రాయించుకుంటూ సినిమా పాటకే గౌరవం లేకుండా చెయ్యడం జరుగుతోంది.

పద్యం అలాకాదు. ఎటువంటి సంగీతాన్ని మిళాయించకుండా పద్యం స్వతంత్రంగా బతకగలదు. పద్యాన్ని చదవటం అంటారు గాని పాడటం అని ఎవరూ అనరు. అసలు పద్య రచనకు కావలసిన డిసిప్లిన్ వేరు. ఆ డిసిప్లిన్ ఉన్నప్పుడే పద్యం రాణిస్తుంది.

"సంగీతలక్ష్మి" లోని అంతర్నాటకంలో యన్.టి.ఆర్. శ్రీకృష్ణుడుగాను జమున అర్జునుడుగాను నటిస్తారు. లేక అటునుంచి ఇటో ఏమో? అంటే జమున కృష్ణుడుగాను యన్. టి. ఆర్. అర్జునుడుగాను – ఊఁ హుఁ అలాంటి అనుమానమే అనవసరం. శ్రీ కృష్ణ పాత్రను రామారావుగారు ఇంకొకళ్ళకి వదలిపెట్టడం అనేది అసంభవం.

# నలుగురు కలిసీ

నలుగురు కలిసీ పొరువులు మరిచీ
చెయ్యాలి ఉమ్మడి వ్యవసాయం – మన
కిష్టం దెక్కువ ఫలసాయం – ఇది
రైతులకెంతో సదుపాయం ॥

ఒక సంసారం పందెకరాలను
పండించటమే అరుదుకదా – అది
భరించలేని బరువుకదా
పదికుటుంబములు వెయ్యెకరాలను
సాగు చెయ్యడం సులువు కదా ॥

మహారాజులూ జమీందారులూ
మచ్చుకు దొరకని కాలంలో – ఈ
ప్రజలే ఏలే రాజ్యంలో
ఇతరుల కష్టం దోచుకు తినడం
ఇకపై సాగే పనికాదు!

ఇదియే సూత్రం ఒక్కడు మాత్రం
భూమిని గుత్తకు కొనరాదు – కడు
సోమరిపోతై మనరాదు
నేలా నీరు గాలీ వెలుగూ
కొందరి సొత్తని అనరాదు – అవి
అందరి హక్కై అలరారు ॥

ఒక్కొక్క వ్యక్తి, సమస్త శక్తి
ధారపోసి పనిచెయ్యాలి – ధన
ధాన్యరాశులే పెంచాలి
కూటికి గుడ్డకు లోటులేక తన
కవసరమైనవి పొందాలి ॥

ఈ పాటతోనే దుక్కిపాటి మధుసూదనరావుగారి అన్న పూర్ణా పిక్చర్స్‌తో నా కేర్పడిన దృఢానుబంధానికి ప్రారంభం. ఇది "తోడికోడళ్లు" చిత్రంలోనిది. అక్కినేని మీద పిక్చరైజ్ అయిన ఈ పాటకు అడుగడుగున కరతాళ ధ్వనులతో ప్రేక్షకులు ఆదరణ చూపించారు. నాటినుండి నిన్న మొన్నటి "పెళ్ళీడు పిల్లలు" దాకా అన్నపూర్ణా సంస్థతో మా స్నేహబాంధవ్యం సాగుతూనే వస్తోంది.

# ఆకాశవీధిలో

ఆకాశ వీధిలో అందాల జాబిలి
ఒయ్యారి తారను చేరి ఉయ్యాల లూగెనే
సయ్యాటలాడెనే ॥

జలతారు మేలిమబ్బు
పరదాలు నేసి, తెరచాటుచేసి
పలుమారు దాగి దాగి
పంతాలు పోయి, పందేలు వేసి
అందాల చందమామ దొంగాటలాడెనే
దోబూచులాడెనే

జడివాన, హోరుగాలి
సుడిరేగిరాని, జడిపించబోనీ
కలకాలం నీవే నేనని
పలు బాసలాడి, చెలి చెంత చేరి
అందాల చందమామ అనురాగం చాటెనే
నయగారం చేసెనే ॥

ఆ రోజుల్లో అన్నపూర్ణా పిక్చర్స్‌వారు ద్విభాషా చిత్రాలు తీసేవారు. తెలుగు తమిళ భాషల్లో. తెలుగుకి నేనూ, అరవానికి ఉడుముల్లై నారాయణ కవీ పాటలు రాస్తుండే వాళ్ళం. అన్ని పాటలూ నేనే రాయాలనే ఆదుర్దా నా కెప్పుడూ లేనందువల్ల మొదట్లో ఆరుద్రని, తర్వాత దాశరథినీ అన్నపూర్ణా సంస్థకు నేనే పరిచయం చేశాను. ఉడుముల్లై కవీ నేనూ పాటల రచనకి కలిసే కూర్చుండేవాళ్ళం. కొంచెం అటూ ఇటూగా రెండు వెర్షన్లూ ఒకేసారి పూర్తి అయిపోయేవి. "ఆకాశవీధిలో అందాల జాబిలి" అని నేను రాస్తే "ఆకాశ వీధియల్ అళఘాన వెన్నిలా" అని అతడు రాశాడు. అలాగే "అగాధమౌ జలనిధిలోన ఆణి ముత్యమున్నటులే.... " అన్న అయిడియా నారాయణ కవిది. అతడు చాలా గట్టివాడు. యతిప్రాసల పట్టింపు అతని కెంతో ఎక్కువ. "ఇలక్కణం" అనేవాడు లక్షణ భంగం అనేది అతనికి సుతరామూ కిట్టేది కాదు. ఇప్పటి సినీకవులు రైమ్‌నే కాదు రీజన్‌ను కూడా అధఃపాతాళాని కణచెయ్యగలరు.

ఒక పాట, "ఓ రంగయో పూలరంగయో" అనే దానికి, సరియైన తమిళరూపం నారాయణకవికి దొరకలేదు. రకరకాలుగా ప్రయత్నించాడు. నేను రాసినదానిలో ఎంతో

తెలుగు దనం ఉందని అతనికి తెలుసు. నారాయణకవి తెలుగు బాగా మాట్లాడుతాడు. తన పూర్వీకులు తెలుగు వాళ్లే అంటాడు. బహుశా మా పూర్వీకులు తమిళ నాటికి చెందినట్లు.

"ఓ రంగయ్యో, పూలరంగయ్యో" అన్నదానికి "ఏవేలప్పా, తంగవేలప్పా"అనే పల్లవితో అసంతృప్తికరంగా సరిపెట్టుకోవలసి వచ్చింది.

# కలకానిది

కలకానిది, విలువైనదీ – బ్రతుకు
కన్నీటి ధారలలోనే బలిచేయకు ॥

గాలివీచి పూవుల తీగ నేల రాలిపోగా
జాలివీడి అటులేదాని వదలివైతువా
చేరదీసి నీరుపోసి చిగురించనీయవా ॥

అలముకొన్న చీకటిలోనే అలమటించనేలా
కలతలకే లొంగిపోయి కలవరించనేలా
సాహసమను జ్యోతిని చేకొని సాగిపో ॥

అగాధమౌ జలనిధిలోనా ఆణిముత్య మున్నటులే
శోకాల మరుగున దాగి సుఖమున్నదిలే
ఏదీ తనంతతానై నీ దరికిరాదు
శోధించి సాధించాలి, అదియే ధీరగుణం ॥

అన్నపూర్ణా పిక్చర్స్‌వారి "వెలుగు నీడలు" లోని ఈ పాటకు ట్యూన్ వెదకడానికి సంగీతదర్శకుడు పెండ్యాల 15 రోజులు కృషి చేశాడు. ట్యూన్ ఓకే అయిన తర్వాత తెలుగు పాట నేను, తమిళపాట నారాయణ కవి రాశాము. సాధారణంగా అన్నపూర్ణా సంస్థలో ముందుగా ట్యూన్ నిర్ణయించడం జరుగుతుంది. సంగీతం విషయంలో మధుసూదనరావుగారికి మంచి అభిరుచి వుంది. హిందీలో రాజ్‌కపూర్‌కి ఉన్నట్లు అందుకే వీరిద్దరి చిత్రాలలోని పాటలు నాలుగు కాలాలపాటు నిలిచేవిగా వుంటాయి.

ఎంత వరకు నిజమో నాకు తెలియదుకాని ఆత్మహత్య చేసుకోబోయిన ఒక వ్యక్తి "కలకానిది, విలువైనది" అన్న పాటను విని ఆ ప్రయత్నం విరమించుకున్న ఉదంతం ఎవరో చెప్పగా విన్నాను.

# మనసున మనసై

మనసున మనసై బ్రతుకున బ్రతుకై
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము॥
ఆశలు తీరని ఆవేశములో,
ఆశయాలలో ఆవేదనలో
చీకటి మూసిన ఏకాంతములో
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము ॥

నిన్ను నిన్నుగా ప్రేమించుటకు
నీకోసమె కన్నీరు నించుటకు
నేనున్నానని నిండుగ పలికే
తోడొకరుండిన అదే భాగ్యము అదే స్వర్గము.॥

చెలిమియె కరువై, వలపే అరుదై
చెదరిన హృదయము శిలయైపోగా
నీ వ్యధ తెలిసీ నీడగ నిలిచే
తోడొకరుండిన అదే భాగ్యము ఆదే స్వర్గము ॥

ఇది ఆత్రేయ పాట అనుకోవడానికవకాశం ఉంది. కాని నేనే రాశాను. "కారులో షికారు కెళ్ళే..." అనే పాట రాసింది నేనని చాలా మంది అనుకుంటారు, కాని ఆపాట ఆత్రేయది.

# పరువపు వలపుల సంగీతం

పరువపు వలపుల సంగీతం
ఉరకలు వేసే జలపాతం
పరుగులు తీసే అనురాగం
దానికిలేదే ఆటంకం.
లైలా మజ్నూ దేవదాసుల
కాలం చెల్లిపోయింది.
జాలీ బాబీ లవ్ నిలిచే కాలం వచ్చింది
నువ్వూ నేనూ ఒకటై వెలిగే కాలం వచ్చింది. ॥
పూవు తావీ వేరై వుండవు
వెన్నెల చంద్రుని విడిపోదు
పెద్దలు ప్రేమకు అడ్డం పడితే
పిన్నలు పాఠం చెబుతారు
మనసులేకమయి నిలుచువారలకు
చేతికందగల దాకాశం
జడుపుమాని ముందడుగు వేయమని
యువతరానికిది సందేశం॥

ఇది "అన్నపూర్ణా" వారి సరికొత్త చిత్రం "పెళ్ళీడు పిల్లలు" లోనిది. ఈ పాట సంపుటిలో అన్నపూర్ణా పిక్చర్స్‌కి రాసిన పాటలే ఎక్కువగా వుండటం పాఠకులు గుర్తించే వుంటారు. నిజానికి డబ్బింగు చిత్రాలను మినహాయిస్తే అన్నపూర్ణా చిత్రాలకే ఎక్కువ పాటలు రాశాను.

ఒక్క "శ్రీవళ్ళి " అనే తమిళ చిత్రంలోనే సుమారు 20 పాట లున్నాయి. "జగన్మోహిని" అనే కన్నడ చిత్రంలోని 12 పాటలలో పదింటిని ఒకే రోజులోనూ, మిగిలిన రెండూ మరునాడు రాశాను.

పాట విషయంలో నేనే ప్రొడ్యూసరునూ నాకెంత కావాలని అడగలేదు. వాళ్ళెంత యిస్తే అంతే పుచ్చుకోవడం ఇప్పటికీ నాకు అలవాటు. అటువంటిది ఎప్పుడు నాకు పాటకు 500 రూపాయలిచ్చే దుక్కిపాటి మధుసూదనరావుగారు, "పరువపు వలపుల" పాటకు నేనడక్కుండానే వెయ్యి రూపాయలిచ్చారు.

# మనుష్యుడిల

పదునాలుగు లోకముల ఎదురేలేదే
పదునాలుగు లోకముల
ఎదురన్నది లేదుగా
మానవుడే సర్వశక్తి ధాముడు కాదా.

మనుష్యుడిల మహానుభావుడే. - చూడగా
మనుష్యుడిల మహానుభావుడే

మానవుడే తలచినచో
గిరులు నెగురవేయడా
మానవుడే తలచినచో
నదుల గతులు మార్చడా
మానవుడే తలచినచో భూమ్యాకాశాలనే
ఏకముగా చేయగల సేతువు నిర్మించడా
మానవుడేనోయ్
మానవుడే నోయి సురాసుర కిన్నర గంధర్వులు
గర్వమణచగలిగినట్టి ధీరుడోయీ ॥

నయనమ్ముల రాగముతో
హృదయమ్మున స్నేహముతో
మానవుడే సృష్టి కలంకారము
స్వేచ్ఛా స్వాతంత్ర్య మహాదీక్షా సాధన వీరుడే
మానవుడే యుగ భవన ద్వారము
మానవుడేనోయ్,

మానవుడేనోయి ధరామండలమున స్వర్గమునే
స్థాపించగజాలినట్టి వీరుడోయీ ॥

గ్రహ నక్షత్రాల నడుమ
క్రమ్మిన చీకట్ల నడుమ
మానవుడే కాంతి కిరణ దీపము

ప్రణయ సుధా ధారలతో, ప్రళయ విష జ్వాలలతో
మానవుడే పరామాత్ముని రూపము మానవుడేనోయ్,
మానవుడే నోయి జరామరణములను దాటి సదా
అమరకీర్తి నందగలుగు ధీరుడోయీ॥

ఇది "గాంధారీ గర్వ భంగం" అనే డబ్బింగ్ పిక్చర్‌లోని పాట – ఒక్క పాట కోసమే మళ్ళీ మళ్ళీ చిత్రాన్ని చూడాలనిపించే పాటలలో ఇదొకటి. డబ్బింగు పాట అనే మాటే గాని ఇందులో –

"మనుష్యుడిల మహానుభావుడే – చూడగా
మనుష్యుడిల మహానుభావుడే."

అనే పల్లవికి మాత్రమే మాతృకలో పెదవుల కదలిక ఉంది అందుచేత మిగిలినదంతా సర్వస్వతంత్రంగా రాయటానికి నాకు అవకాశం కలిగింది.

ఈ చిత్రం విడుదలయిన తొలిరోజుల్లోనే తొలి మానవుడు గగారిన్ భూమ్యాకర్షణ శక్తిని అదిగమించి రోదసీ యాత్ర చేస్తూ ధరణీ పరిభ్రమణం కావించడం కూడా ఆ చిత్ర విజయానికి కారణం కావచ్చును.

చిత్రమేమిటంటే, ఆ తర్వాత పిక్చరుకి ఒక తక్కువ మొత్తం తీసుకోమని ప్రాధేయపడుతూ నా దగ్గరకు వచ్చాడు ప్రొడ్యూసర్లలో ఒక భాగస్వామి. "మీరు blank cheque తో వచ్చి వుండవలసింది. క్రిందటి చిత్రం విజయవంతమైనందుకు అలా వచ్చి ఉంటే మీరిప్పుడంటున్న మొత్తంలో సగానికే ఒప్పుకొని ఉందు" నన్నాను. "ఏమో కవికి మా బడ్జట్ ఆరువేలు టేకిట్ ఆర్ లీవిట్" అన్నారాయన. నేను వదిలేశాను. ఇలా నేను వదిలేసినవాటిని ఏరుకునే వాళ్ళు అప్పట్లో కవులు.

మరో చిత్రమేమంటే – ఇలా చెప్పాలంటే చాలా ఉన్నాయి.– ఈ మధ్య "గాంధారీ గర్వభంగం" కథనే తీసుకొని "బాల భారతం" అనే చిత్రం వచ్చింది. అందులో నా పాటను అనుకరిస్తూ ఒక పాట వచ్చింది. "అదుగో అలాంటి పాట నాకు మీరు రాసిపెట్టాలండీ" అన్నాడొక ప్రొడ్యూసరు అమాయకంగా! పాపం బహుశా ఆయన "గాంధారీ గర్వభంగం" నాటికి పుట్టి ఉండలేదేమో.

# నా హృదయంలో

నా హృదయంలో నిదురించే చెలీ !
కలలలోనే కవ్వించే సఖీ
మయూరివై వయ్యారివై నేడే
నటనమాడి నీవే
నన్ను దోచినావే॥

నీ కన్నులలోన
దాగెనులే వెన్నెల సోన
చకోరమై నిను వరించి
అనుసరించి నానే
కలవరించి నానే ॥

నాగానములో నీవే
ప్రాణముగా పరిమళించినావే
పల్లవిగా పలుకరించ రావే
నీ వెచ్చని నీడ
వెలసెను నా వలపుల మేడ
నివాళితో నిను తలంచి
ఎదురు చూచినానే
నిదుర కాచినానే ॥

ఇది నాకు చాలా ఇష్టమైన పాటలలో ఒకటి. "జగపతీ" వారి "ఆరాధన" లోనిది. బెంగాలీ ట్యూన్‌ని అక్షరాలా అనుకరిస్తూ రాసినప్పటికి ఒక స్వతంత్రమైన తెలుగు పాట రాశానని గర్విస్తున్నాను.

ఎవరో అడిగారు నన్ను --- "ఆ నిదురించే చెలి యెవ"రని . "కమ్యూనిజం" అని జవాబిచ్చాను. "ఆరాధన" ఆడుతున్న రోజుల్లో నేను విశాఖపట్టణం వెళ్ళటం సంభవించింది. అప్పుడు ఆంధ్రా యూనివర్సిటీలో చదువుకుంటున్న విద్యార్థి ఒకడు "నీడ వెచ్చగా వుంటుందా ? మీరు రాసింది తప్పు" అన్నాడు. "కుర్రాడివి నీకు తెలియదు నాయనా! ప్రియురాలి నీడ వెచ్చగానే వుంటుం" దన్నాను.

# ఈ సిరుల కొరకు

నేటిదా ఒక నాటిదా ఏనాటిదో
ఈ సిరుల కొరకు సాగేటి పోటీ
దేవదానవుల కాలం నాటి
తెరిపిలేని పోటీ ఎడ
తెరిపిలేని పోటీ ॥

పాలకడలికే చని
అట నానా బాధలుపడి
సరిసమానమైన శ్రమలకోర్చి తుదకమృతభాండమునుకని
అది మాదంటే మాదని
అంతవరకు తామన్నదమ్ములుగ కాలంగడిపిన సురాసురులు
సై అంటే సై అంటూ
ఒకరిపై ఒకరు కక్షలు పూని
ఒకరిపై ఒకరు కత్తులు దూసి
హోరాహోరిగ పోరాడిన కథ
నేటిదా ఒక నాటిదా ॥

ఎవరే సుకుమారి, ఆడే పాడే వయ్యారి
మగువ చూపులలోనే మరుని బాణాలు దూసె
మేని వంపులయందే వేయి సొంపులు చిందె
ఎవరే సుకుమారి, ఆడేపాడే వయ్యారి ॥

వంతు తెగని వైఖరి – కని
వచ్చె నటకు మోహిని – మీ
విభేదాలనే పరిష్కరించి
అమృతం పంచెదనని – మీ
అంతు తేల్చుతానని!
సిరిసంపదలను పంచాలంటే
కుడియెడమలు పాటించాలని –హై
హై అంటే హై అంటూ

ఎడమ ప్రక్కగా ఒకరిని తరిమి
కుడిప్రక్కగ ఇంకొకరిని నిలిపి
కుడి ఎడమలతో నడిపిన యీ కథ
నేటిదా ఒక నాటిదా ఏనాటిదో ఏనాటిదో

తిలక్ డైరక్షన్‌లో, పెండ్యాల సంగీత సారథ్యంతో శంభూ ఫిలింస్ వారు నిర్మించిన "పంతాలు, పట్టింపులు" చిత్రంలోని తొలి పాట ఇది.

# ఇనుకోరా

ఇనుకోరా ఇనుకోరా
ఈ మల్లన్న మాటే ఇనుకోరా
ఇనుకుంటే అది మంచికిరా
ఇనకుంటే కత కంచికిరా ॥

ఈ బతుకుందే మా సెడ్డ బరువు
మోసం ఒకటే శానా తేలిక
నిజముందే అది ఎంతో కరువు
దానిని దాచు, పొదుపుగవాడు ॥

వచనం : ఊఁ. అవును. నిజం.
తెలుపు రంగు సత్యానిది
పసుపు రంగు పైత్యానిది
నలుపు రంగు సీకటిది
ఎరుపు రంగు ఆకలిది
కాలే ఆకలి కార్చిచ్చు – దాన్ని
కల్లు నీళ్ళతో సల్లార్చు – ఈ
కల్లు నీళ్ళతో సల్లార్చు ॥

వచనం : ఆఁ అదదీ మాట.

ఇది కూడా "పంతాలు, పట్టింపులు" చిత్రంలోనిదే. నాకు నచ్చిన సినిమా పాటలలో మొదటి స్థానం దీనికిస్తూ కొంత కాలం కిందట ఒక సినీవారపత్రికలో చిన్న వ్యాసం రాశాను. సంగీతానికీ, సాహిత్యానికీ సంబంధించిన విలువల మాట అటుండగా ఈ పాట వెనుక విషాదకరమైన సంఘటన ఒకటుంది. అదే ఈపాట నా గుండెల్ని హత్తుకోడానికి కారణం.

టూకీగా ఆ సంఘటన ఇది : నేనీ పాట రాస్తుండగా పెండ్యాల స్వర కల్పన చేస్తున్నాడు. అప్పుడు నా పక్కనే చదలవాడ కుటుంబరావు ఉన్నాడు. పల్లవి ముగించి, మొదటి చరణం "ఈ బ్రతుకుందే ఎంతో బరువు" అని రాశాను. "మా సెడ్డ బరువు"

అని సూచించాడు చదలవాడ. ట్యూన్‌లో భంగం రాకుంటే నా అభ్యంతరం లేదన్నాను పెండ్యాల ఓ.కే అన్నాడు. నేను సరే అన్నాను.

ఆ రాత్రి ఒక పిక్చరులో తన ఆఖరి వర్కు ముగించుకొని తెల్లవారుతుండగా అలిసిపోయి కుటుంబరావు యింటి కొచ్చాడు. కూతుర్ని మంచినీళ్ళు తెమ్మన్నాడు. తెచ్చినవి తాగి, "నిద్రపోతాను నన్ను లేపవద్దు" అన్నాడు., అదే నిద్ర పోవడం, మరి లేవలేదు.

# కో కో కో కో కో నట్

అతడు : కో కో కో కో కో నట్
కుర్రది తెచ్చిన కో కో నట్
కోతికి దొరికిన కోకో నట్
విరిచిన విరగని కరచిన నలగని కో కో కో కోకో నట్ ॥

ఆమె : నో నో నో నాకెు బిట్
ఓ ఓ ఓ యూ ఇడియట్
బంతిని చూచి భ్రమ పడ్డావ్
అనవసరంగా శ్రమపడ్డావ్
కొబ్బరికాయే నీ తలకాయ
కో కో కో కో కో నట్ , గో గో గో యూ ఇడియట్ !

అతడు : నో నో నో జూలియట్
బంతిని నువ్వు తిన్నగా రువ్వు
అంతే అంతే చాలు
ఇదిగో ట్రిక్కు ఒకటే కిక్కు
చేసేస్తాను గోలు

ఆమె : గోల్ గోల్ గోల్ గోలని గోలేకాని
ఏమీ తెలియదు నీకు. నా జోలికి నువ్వింక రాకు
సోలో పాటలు పాడుకో
జోడీ పాటలు మానుకో !

అతడు : మనసు నీ మీద నా కుంది గాని
అసలు నా మీద నీ కున్నదా?

ఆమె : ఉన్నదో లేదో ఊహించి చూడు
ఇన్ని వాదాలు నీ కెందుకు?

అతడు : ప్రేమరాణీ

ఆమె : ఓ హో హో

అతడు : చేర రావే

ఆమె : ఆ హో హో

అతడు: ఐనది గోలు విరిగెను కాలు చాలునులే
ఆమె: ఆవుము పోకీ నీకిక బాకీ తీరదులే
సరి సరి పోని అరమరలేని
బ్రదుకులు గడపి పొరుపులు మరచి
జంటగనే ఉందామా డియర్ ఇడియట్

ఈపాట రాశానన్న సంగతి ఎప్పుడో మరిచి పోయాను. ఇది అనిసెట్టి సుబ్బారావు డైరెక్టు చేసిన "కన్నుల పండుగ " చిత్రంలోనిది. ఇలాంటి పాటలు రాయడానికిప్పుడు నన్నెవరూ పిలవరు.

# బొమ్మను చేసి

బ్రదుకంత బాధగా
కలలోని గాథగా
కన్నీటి ధారగా కరిగిపోయే
తలచేది జరుగదు
జరిగేది తెలియదు.

బొమ్మను చేసి ప్రాణము పోసి
ఆడేవు నీకిది వేడుక
గారడి చేసి గుండెను కోసి
నవ్వేవు ఈ వింత చాలిక ॥

అందాలు సృష్టించినావు – దయతో నీవు
మరల నీ చేతితో నీవు తుడిచేవులే
దీపాలు నీవే వెలిగించి నావే
గాఢాంధకారాన విడిచేవులే
కొండంత ఆశ అడియాస చేసి
పాతాళలోకాన త్రోసేవులే ॥

ఒకనాటి ఉద్యానవనము
నేడు కనము
అదియె మరుభూమిగా నీవు మార్చేవులే
అనురాగ మధువు
అందించి నీవు
హాలాహల జ్వాల చేసేవులే
ఆనంద నౌక పయనించు వేళ
శోకాల సంద్రాన ముంచేవులే.

హాస్యనటుడు పద్మనాభం నిర్మించిన "దేవత" లోని పాట ఇది. దీనిలో ---
"బొమ్మను చేసి ప్రాణము పోసి

ఆదేవు నీకిది వేడుక --- " అనే పల్లవి వేటూరిది. అతని అనుమతి మీద, పద్మనాభం కోరిక మీద ప్రారంభంలోని సాకీతో సహా దీన్ని పూర్తి చేశాను. కీర్తిశేషుడు కోదండపాణి తయారు చేసిన బాణీ రచయితను తికమక పెట్టేదిగా ఉంది. కష్టపడి నేను రాసిన పాటలలో ఒకటిగా దీనిని చెప్పుకోవాలి.

# కాశీపట్నం

వచనం : ఓహో, నిలబడితే పడిపోయే నీరసపు
నీడవంటి బీదవాడా ! మనిషిగా బ్రతికేందుకు
కనీసావసరాలైనా లేనివాడా ! అయ్యయ్యయ్యయ్యయ్యో!

కాశీ పట్నం చూడర బాబు
కల్లా కపటం లేని గరీబూ
అల్లో లక్ష్మణ అని అల్లాడే
పల్లెల దుస్థితి కేమి జవాబు?

నిరాశతోను నిస్పృహతోను
తెరువెరుగని నిరుపేదలు
మురికి గుంటలు ఇరుకు కొంపలు
నిండిన చీకటి పేటలు
పాడు రోగాలు మోసుకు తిరిగి
ప్రాణాలను చంపే ఈగలు
కరువూ బరువూ పరితాపాలూ
కలిసి వెరసి మన పల్లెలు ॥

వచనం : శరీరాల్లో అరచటాకయినా రక్తంలేని దరి
ద్రులనే పీల్చుకు తింటాడు దోమ రాక్షసుడు ! వాడి
దుంప తెగ ! మేడల్లో మిద్దెల్లో నివసించే వారి
జోలికయినా పోడుకదా, అయ్యయ్యయ్యయ్యయ్యో!

వైద్య సహాయం అసలే లేదు.
ఉన్నా దొరకవు మందులు
డాక్టరు కోసం వెతికే లోగా
రోగులు గుటుక్కు మందురు
నెత్తురు పీల్చే వృత్తిపరులె మన
గ్రామాలకు కామందులు
దొరలు దోమలు పల్లె జనాలను
పంచుకు నంజుకు తిందురు.

# చెమ్చాతో సముద్రాన్ని

చెమ్చాతో సముద్రాన్ని తోడశక్యమా?
కత్తితో విమానాన్ని తోల సాధ్యమా?
నేనన్నది రైటేనా సిరిసిరిమువ్వా?
నీకింకా డౌటేనా గడసరి గువ్వా?
పైసాతో ప్రేమ విలువ కొలువ సాధ్యమా
మాటలతో ప్రేమ బలం తెలుపశక్యమా?
నేనన్నది రైటేనా సిరిసిరిమువ్వా?
నీకింకా డౌటేనా కులుకుల గువ్వా?!
ఇంటి పట్టు వదిలిపెట్టి రానంటావు
క్షణమైనా తీరుబాటు లేదంటావు
అసలు నీకు అనురాగం
లేదని నా అనుమానం
ఉంటే నన్నెందుకిలా వేధిస్తావు ॥
నీడలాగ వదలరు మా నాయనగారు ముసలాయనగారు
గడపదాటి వస్తే చెవి మెలివేస్తారు అది నే చూస్తాను
లేదంటే మమకారం
అదినీకే అవమానం
ఇంకా నన్నెందుకిలా బాధిస్తావు. ॥చెమ్చా ॥
మనకింక లోటేది సిరిసిరిమువ్వా !
మన ప్రేమకు సాటేది కులుకుల గువ్వా!

* * *

ప్రత్యగాత్మ డైరెక్టు చేసిన "చిలకా గోరింకా" లోనిదీ పాట. పాటల పుస్తకం దొరకలేదు. అది దొరికితే, లేదా ఎవరయినా సంపాదించి పంపితే, ఈ పుస్తకానికి రెండో ముద్రణ అనేది వుంటే అందులో పూర్తి వెర్షన్ ఇస్తాను.

ఈ పాటను పద్మనాభం, రమాప్రభల మీద చిత్రీకరించడం జరిగింది. హాస్య జంటకు యుగళగీతం ఆ రోజుల్లో ఒక విడ్డూరమే. ఈ రోజుల్లో నాయికా నాయకుల యుగళ గీతాలు కూడా హాస్యాస్పదంగా తయారవుతున్నాయి. ఏది ఎలా వున్నా ఈ పాటతో రమాప్రభకు హాస్యనటిగా పరిశ్రమలో గుర్తింపు కలిగింది.

# చెవిలో రహస్యం

ఆ చెవిలో రహస్యం, ఈ చెవిలో రహస్యం
అన్నిటికీ సిద్ధపడాలి
ఇదే అవసరం, అవసరం, అవసరం ॥

ఉసురుకోసమొక వైపు పోరాడు వేళనే

పదవికోస మొకవైపు పోరాటం సాగెరా
దుఃఖాలే వేధిస్తే తూలిపడు దీనుల
ఒక పక్క చూస్తూ మరి ఉల్లాసం ఏలరా?
కళ్యాణం చెయ్యగా కావాలా అందలం?
కచ్చేరీ అవసరమా ? ఊరేగుట ముఖ్యమా?
ఇది మాని ఎవడైనను కళ్యాణమాడితే
ఆ మనిషికి బిడ్డ పాప జనియించకపోవునా?
అనరాని రహస్యం, కనరాని రహస్యం
అన్నిటికీ సిద్ధపడాలి ॥

అచ్చటగా ముచ్చటగా పెచ్చు నగల్ తొడిగితే
మర్యాద, సౌందర్యం వచ్చుననుట పిచ్చియే!
పొంచి మొసలు దొంగలకు మంచి తరుణమే కదా !
పొలతులకీ గుణపాఠం తెలిసిందో తెలియదో ॥

నిరుపేదలు నివసించే గుడిసెలలోనైనను
చల్లగాలి, చంద్రకాంతి ప్రసరించకపోవునా?
గుణవంతులు, ధనవంతులు భగవంతుని సాక్షిగా
ధనహీనుల కష్టాలను తొలగించుట ధర్మము!

ఆకలితో బాధపడే అనాథల రక్షించగా
సిరిసంపదకల వారు మునుముందుకు రావలె;
ధనముందని పెను గర్వం తలకెక్కని తీరుగా
తగురీతుల ఉపకారములొనరించుట న్యాయము ॥

"చెవిలో రహస్యం" నేను అరవం నుంచి సొంతంగా డబ్ చేసి రమారమి 40 వేల రూపాయల దాక చేతులు కాల్చుకున్న చిత్రం. దీనికి ఏకొద్దిగానైనా ఆర్థిక విజయం కలిగి నేను ప్రొడ్యూసరుగా స్థిరపడి ఉంటే ఈ నాటి ఫిలిం పరిశ్రమ ఇప్పుడున్న విధంగా ఉండేదికాదు. ఏమయితేనేం సినీమా జూదంలో నేను చేరిపోయాను. శ్రీనాథకవి "బొట్టు పల్లెను గొడ్డేరి మోసపోతి" అన్నట్లు గుర్రపు పందాలలోకూడా నేనెప్పుడూ గెలవలేదు. (ఒక్కసారి తప్ప) వెళ్ళినప్పుడల్లా నూరు రూపాయలు మాత్రం తీసుకు వెళ్లే వాణ్ణి. తిరిగి వచ్చేటప్పుడు జేబులో కొన్ని చిల్లర డబ్బులూ నాలుగైదు సిగరెట్లు మిగిలేవి. ఒక్కసారి మాత్రం ఒక గుర్రం మీద పది రూపాయలకు ఒక టికెట్టు కొన్నాను. దానికి 20 రూపాయలు వచ్చాయి. గెలుపుతో ఇంటికి వచ్చిన తొలిసారీ, ఆఖరిసారీ అదే.

ఎవరు నమ్మినా, నమ్మకపోయినా ఇది మాత్రం నిజం. నన్ను గెలిపించిన గుర్రం పేరు శ్రీశ్రీ.

"చెవిలో రహస్యం" చిత్రానికి డైలాగ్ డైరెక్షనూ, మ్యూజిక్ డైరెక్షనూ మాఆవిడ నిర్వహించింది. మాటలు వారం రోజుల్లో, పాటలు (సుశీల, ఘంటసాల, రమోలా మొదలగు వారిచేత పాడించి) 3రోజుల్లో పూర్తి చేసింది. అప్పుడామె తొమ్మిది నెలల పూర్ణ గర్భిణి.

పెట్టుబడి దారీ విదానాన్ని నేను తీవ్రంగా ద్వేషించడానికి కారణమైన ఒక ముఖ్య సంఘటన ఈ చిత్ర నిర్మాణంతోనే ప్రారంభమయింది. డైలాగుల డబ్బింగు జరుగుతున్న వారం రోజులూ నేను స్వదేశంలో లేను నా స్టాండర్డు కారు MSX 138 మీద మార్వాడీ దగ్గర ఆరువేల రూపాయలు అప్పు తీసుకొని, స్వీడెన్‌లో జరిగిన ప్రపంచ శాంతి సభలకు వెళ్ళాను. తర్వాత 6 సంవత్సరాలలో పాతికవేలు వడ్డీ కడుతూ వచ్చినప్పటికీ అసలు 6వేలు తీరనేలేదు. మార్వాడీ కారు పట్టుకుపోయాడు. నేను చెల్లించిన 25 వేలు అతని ఆదాయపు లెక్కలలో చూపించినవి. మరి నల్ల డబ్బు రూపంలో నాదగ్గర ఎంత గుంజుకున్నాడో నాకే తెలియదు. మరి ఇలాంటి అనుభవాలతో పెట్టుబడిదారీ విదానాన్ని నేనెలా ప్రేమించగలను.?

# ఇదిగో ఇదిగో ప్రపంచం

ఇదిగో ఇదిగో ప్రపంచం – ఇది
ఎంతో వింత ప్రపంచం
మనిషి కోసమై మనిషే చేసిన
మహా మంచి ప్రపంచం – ఓహో హోయ్
మాయదారి ప్రపంచం ॥

కలిసి మెలసి మనిషీ పశువూ
సావాసం చేసే లోకం
కళ్ళు మూసి తెరిచే లోగా
జనాభాలు పెరిగే లోకం
పాపాయికి పాలో అంటే
పాపానికి లాగే లోకం
రూపాయలు వెదకాలంటూ
దీపాలను ఆర్పే లోకం

చిరిగిన విస్తరి మెతుకులతో
అతుకుల బొంతల బ్రతుకులతో
పేదల కోసం ధనికులు కట్టిన
మహా మంచి ప్రపంచం ॥

ప్రాజెక్టుల వాగ్దానాలు,
మిగిలేవే పునాదిరాళ్ళు
అభయానికి ఎత్తిన చెయ్యి
అందరికీ నెత్తిన చెయ్యి
ధరించేది కాషాయం
దూరేది కల్లు దుకాణం
జపించేది తారక మంత్రం
పీల్చేదే పేదల రక్తం
ప్రజలాశించిన సురలోకం
ప్రభువులు తెచ్చిన యమలోకం

మన గాంధీజీ కమ్మని కలలే
మసి చేసిన ప్రపంచం - ఓహో హోయ్
మాయదారి ప్రపంచం ॥

పదవులకై బడి పిల్లలనే
భస్మాసురులను చేసే లోకం
పంతానికి తమ సంపదలే
పాడుపెట్టి మురిసే లోకం
శ్రమ జీవుల వ్యవసాయంతో
సోమరులే బలిసే లోకం
ధనరాసుల గుణకారంతో
దారిద్ర్యం పెరిగే లోకం

ఆకసమంటే మేడలతో
ఆకలి మంటల పీడలతో
ధనికుల కోసం పేదలు కట్టిన
మహో మంచి ప్రపంచం - ఓహో హోయ్
మాయదారి ప్రపంచం.

ఇది ఆదుర్తి డైరెక్టు చేసిన, అక్కినేని నటించిన "మరో ప్రపంచం" లోనిది. యస్.పి. బాలసుబ్రహ్మణ్యం పాడిన నా మొదటిపాట ఇదే అనుకుంటాను.

# భూమికోసం

భూమికోసం భుక్తికోసం
సాగే రైతుల పోరాటం
అనంత జీవిత సంగ్రామం ॥

రాజులు మారి, రోజులు మారి
పాలన చేసే పద్ధతి మారి
మారని దొకటేరా – అది
దున్నే రైతుల బ్రతుకేరా

సంపద పెంచే తీరులు మారి
పంపకాలలో రీతులు మారి
మారని దొకటేరా – అది
పేదల ఆకలి మంటేరా ॥

తూరుపు దిక్కున వీచే గాలి
పడమటి కడలిని పిలిచే గాలి
తూరుపు పడమర లేకం చేసే
తుఫానులా చెలరేగేదాకా
భూమికోసం భుక్తి కోసం
సాగే రైతుల పోరాటం
అంతం కాదిది ఆరంభం ॥

అనుపమ చిత్రం "భూమికోసం" కె. రామనరసింహారావు (నక్సలైట్) కు అంకితం. ఇతడు దర్శక నిర్మాత తిలక్‌కు సోదరుడు. అరుదుగా దొరికే చైనా సాహిత్యాన్ని నా చేత చదివించేవాడు.

తిలక్ చిత్రానికి "భూమి కోసం" అనే పేరునేను పెట్టిందే. ఒక ఐరిష్ రచయిత రాసిన LAND (భూమి) అనే నవల నాకిచ్చి తిలక్ "దీన్ని మనం చలన చిత్రంగా రూపొందించా" అన్నాడు. ఐర్లాండులోనైనా ఆంధ్రదేశంలో నయినా భూమి సమస్య ఒకటే. నవలను చదివి తెలుగు పేర్లతోనూ, తెలుగు వాతావరణంలోనూ ఒక ప్రాధమిక – సినేరియో తయారు చేశాను.

ఈ చిత్రంలో మొదటిసారిగా నటించిన ప్రభ, జయప్రద ఇప్పుడు ప్రముఖ తారలు. ("భూమికోసం" కంటె ముందుగా "సిడలేని ఆడది" విడుదలైంది.) ఈ యిద్దరిని ఎంపిక చెయ్యడంలో తిలక్‌కు ఏ కొద్దిగానో సాయపడినందుకు గర్విస్తున్నాను.

# ఎవరో వస్తారని

ఎవరో వస్తారని, ఏదో చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా
నిజము మరచి నిదురపోకుమా ॥

బడులేలేని పల్లెటూళ్ళలో
చదువే రాని పిల్లలకు,
చవుడు రాలే చదువుల బడిలో
జీతాలు రాలని పంతుళ్ళకూ
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా ॥

చాలీ చాలని పూరి గుడిసెలో
కాలేకడుపుల పేదలకు,
మందులు లేని ఆసుపత్రిలో
పడిగాపులుపడు రోగులకు
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా ॥

తరతరాలుగా మూఢాచారపు
వలలో చిక్కిన వనితలకు,
అజ్ఞానానికి అన్యాయానికి
బలియైపోయిన పడతులకు
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా ॥

కూలి డబ్బుతో లాటరీ టికెట్
కొనే దురాశా జీవులకు,

దురలవాట్లతో బాధ్యత మరచి
చెడే నిరాశా జీవులకు
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా ॥

సేద్యంలేని బీడు నేలలో
పనులే లేని ప్రాణులకు
పగలూ రేయీ శ్రమపడుతున్నా
ఫలితం దక్కని దీనులకు
ఎవరో తోడు వస్తారని
ఏదో మేలు చేస్తారని
ఎదురు చూసి మోసపోకుమా ॥

ఈ పాట కూడా "భూమికోసం" చిత్రంలోనిదే. గుమ్మడి (పిచ్చి మాష్టారు) మీద చిత్రీకరించడం జరిగింది. ఘంటసాల పాడిన ఆఖరి పాటల్లో ఇదొకటి.

# ఊరంతటికీ

ఊరంతటికీ ఉంటాడొకడే సరదారు
వేరే వుండరు వాడికి వాడే సర్కారు
ప్రజను సంతలో పశువుల్లాగా
కొని పడవేసే కామందు
శవాలలాగా జనులను మార్చి
రక్కసలాడే రాబందు
ఆకాశంలో అమాయికంగా
మిలమిలలాడే రేచుక్క
అరాచకానికి బలియైపోయిన
అనాధ బాలిక రామక్క
అలాంటి కన్నెల మానాలు - వాడి
కామానికి నజరానాలు
అతడిది తరగని అర్ధబలం
అదే తెస్తుంది అంగబలం ॥

జీతం బత్తెం లేని నౌకరీ
ఊపిరి సలపని బండచాకిరీ
అడిగేదేమో పిడికెడు మెతుకులు
దొరికేదేమొ నిప్పుల చురకలు
సరదాకోసం కడు తేలికగా
ప్రాణాలైనా తీసేస్తాడు
జాలికి వాడికి చాలా దూరం
దీనుల బ్రతుకే చిరు ఫలహారం ॥

పచ్చని కొంపల చిచ్చురగిల్చి
జంటను ఒంటరి చేస్తాడు
ఎవరైనా తన కెదురు తిరిగితే
నోటి ముందర కూడు లాగేస్తాడు.
చెట్టుకో పిట్టగా తరిమేస్తాడు - వాడు
చెప్పింది న్యాయం చేసింది చట్టం!

ఊరంతటికీ ఉండదు ఎవడూ సరదారు
మేలుకున్న ప్రజలే తమ నేలను యేలే సర్కారు
పిల్లిని తెచ్చి గదిలో పెట్టి
తలుపులు మూసి తాళం వేసి
కొడితే ఏంచేస్తుంది.
గుడ్లే పీకేస్తుంది.

ప్రజాబలం పేదల విప్లవం
చెలరేగే వరకే చెలగాటం
ఊరంతటికీ ఉండదు ఎవడూ సరదారు
మేలుకున్న ప్రజలే తమ నేలను యేలే సర్కారు

సోఫియా ఇంటర్నేషనల్ వారి, "బ్రతకాలా చావాలా" అనే చిత్రానికి రాసిన పాట ఇది. ఆ చిత్రం ఎక్కడా విడుదలైనట్లు తెలియదు.

# దేవుడు చేసిన

దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా
వినండి మనుషుల గోల
కనండి దేవుడి లీల ॥

బృందం : గోవిందా హరి గోవిందా
వెన్నదొంగ మా తొలిగురువు
తొలినుంచీ మా కుల గురువు
కోరిన కోరిక తీరాలంటే
కోరక మోక్షం రావాలంటే
గోపాలునే సేవించాలి
గోవిందునే ధ్యానించాలి
గోవిందా హరిగోవిందా
గోవిందా భజగోవిందా!

బృందం : గోవింద గోవింద హరిగోవిందా
గోవిందా భజ గోవిందా!
వినండి దేవుడి గోల
కనండి మనుషుల లీల
దేవుడు చేసిన మనుషుల్లారా
మనుషులు చేసిన దేవుళ్ళారా!

పేదల నెత్తురు తాల్చిన రూపం
బలిసిన జలగలు దాచిన పాపం
మానవులను పీడించే డబ్బు
దేవతలను ఆడించే డబ్బు
తెలుపో నలుపో జానేదేవ్ – ఆ
తేడాలిక్కడ లేనేలేవ్
వినండి డబ్బుల గోల
కనండి మనుషుల లీల !

గాలిబుడగ జీవితం
ఓటి పడవ యౌవనం
నిన్న మరల రాదు రాదు
నేడే నిజం నేడే నిజం
రేపు మనది కాదు కాదు

నేడే సుఖం నేడే సుఖం
సుఖం సుఖం నేడే సుఖం !

కాసే బ్రహ్మానందం - అహ
డోసే పరమానందం
ఆనందం పరమానందం
ఆనందం బ్రహ్మానందం
వినండి గ్లాసుల గోల
కనండి మనుషుల లీల ॥

ఆలయాలలో వెలుతురులేదు
ఆకాశంలో చీకటి లేదు
విమానాలలో విహరిస్తుంటే
సముద్రాలనే దాటేస్తుంటే
గుడిలో ఎందుకు రామయ్యా
విడుదల చేస్తాం రావయ్యా - నిను
విడుదల చేస్తాం రామయ్యా రామయ్యా
రామయ్యా! లేవయ్యా!
లేవయ్యా! లేవయ్యా !

"దేవుడు చేసిన మనుషుల్లారా, మనుషులు చేసిన దేవుళ్ళారా! మీ పేరేమిటి?" అనే శీర్షికతో గురజాడ అప్పారావు గారి కథ ఒకటుంది. అది ఈపాట పల్లవిగా ఉపకరించింది. తర్వాత "పద్మాలయా" వారు దానినే తమ చిత్రానికి పేరుగా స్వీకరించారు.

# "యమగోల" నుంచి

సమరానికి నేడే ప్రారంభం
యమరాజుకు మూడెను ప్రారబ్ధం
నరకలోకమున కార్మికశక్తికి
తిరుగేలేదని చాటిద్దాం

ఇంక్విలాబ్ జిందాబాద్
కార్మిక సంఘం జిందాబాద్
లెఫ్ట్ రైట్ - లెఫ్ట్ రైట్

యముడి నిరంకుశ పాలనవద్దు
యమ అర్జెన్సీ ఇకపై రద్దు
వెట్టిచాకిరికి తలపై మొట్టు
వెయ్యండర్రా అందరు ఒట్టు

అందరు : ఒట్టు ఒట్టు ఒట్టు ఒట్టు

భూలోకమె మన పుణ్యతీర్థమని
నరుడే గురుడని పూజిద్దాం ॥

కోరలు కొమ్ములు మీకికవద్దు
రంగుల తేడా లసలేవద్దు
జనతకు సమతను సాధించాలి
చట్టంమార్చే ఓటుండాలి

ప్రజాస్వామ్యమను ఘన సౌధానికి
పునాదిరాళ్లను పరిచేద్దాం ॥

చక్రవర్తి స్వరకల్పనతో ఈ పాట "యమగోల" చిత్రానికొక హైలైటయింది. "Death takes a Holiday" అనే హాలీ వుడ్ చిత్రం దీని కథారచనకు మూలం అని డి.వి. నరసరాజుగారంగీకరిస్తారుగాని ఆ కథకి తెలుగు చిత్రానికీ ఎక్కువ పోలిక లేవీలేవు. ఒక విధంగా ఇది స్వతంత్ర రచనే అని చెప్పాలి.

# మాయల ఫకీరు గోల

మాయల ఫకీరు :

భిక్షాందేహి మాతా – కరుణా
భిక్షాందేహి మాతా
ఉన్నావా? ఉండీ మరిచావా ?
నన్నే విడిచావా?

భక్తవశంకరి, ప్రళయ భయంకరి
బజారులో నను పడవేశావే
భ్రమలన్నీ ఒక చెంపపెట్టుతో
పటాపంచలే చేశావే

కపాలి (శిష్యుడు) :

పులనే పిల్లిగ మార్చేశావే
గురువును నరులకు ఎరవేశావే

మాయల ఫకీరు :

నిజాయితీగా నడవాలంటే
నెలవే లేదే అరంగుళం
అరాజకాల పాడు కడలిలో
ప్రతి మనిషీ ఒక తిమింగలం

కపాలి :

అన్ని దిక్కులా అమంగళం
అసలీ బతుకే భయంకరం

మాయల ఫకీరు :

కాళ్ళా వేళ్ళా పడుతున్నా

కటాక్షించవా కాళీమాతా
మళ్ళీ పుట్టను సెలవిప్పించు
తల్లీ చల్లని భూమాతా
అర్జీ యిదిగో చేకొమ్మా
అభయ హస్తమే నాకిమ్మా !

*   *   *

ఈ పాట రెయిన్ బో ఆర్ట్స్ వారి "గోలనాగమ్మ" చిత్రానికిగాను రాశాను. చక్రవర్తి స్వర కల్పన చేసిన ఈ పాట రికార్డు మాత్రం కాలేదు. ఈ పాట చిత్రంలో లేదని వేరే చెప్పనక్కరలేదు.

ఆఖరి పాదంలోని "అభయహస్తం" సెన్సారు కత్తెరకు గురి అవుతుందని నిర్మాతలు భయపడ్డారేమో అని నా అనుమానం.

# తూరుపు సింధూరపు

తూరుపు సింధూరపు
మందారపు వన్నెలలో
ఉదయరాగం, హృదయగానం
మరల మరల ప్రతియేడూ
మధుర మధుర గీతం
జన్మదిన వినోదం ॥

వేన వేల వత్సరాల వేళలో
మానవుడుదయించిన శుభవేళలో
వీచె మలయమారుతాలు
పుడమి పలికె స్వాగతాలు
మాలికలై తారకలే మలిచె కాంతి తోరణాలు

వలపులోన పులకరించు కన్నులతో
చెలిని చేరె పలుకరించె మగవాడు
మనసులోన పరిమళించు వెన్నెలతో
ప్రియుని చూసి పరవశించె ప్రియురాలు

జీవితమే స్నేహమయం
ఈ జగమే ప్రేమమయం
ప్రేమంటే ఒక భోగం
కాదు కాదు అది త్యాగం ॥

"తులాభారం" అనే మళయాళం పిక్చరు ఆదారంగా తీసిన "మనుషులు మారాలి" లోనిదీ పాట. కొంతమంది దీనిని కమ్యూనిస్టు చిత్రమన్నారు. కేరళ్లో కమ్యూనిస్టు ప్రభుత్వం ఉండడం వల్లనే ఇటువంటి చిత్రం రావడానికి వీలయిందన్నారు. ఒకప్పుడు డాక్టరు రాజారావుగారి "పుట్టిల్లు" గురించి కూడా ఇటువంటి మాటలే వినవచ్చాయి. ఇవన్నీ అర్థసత్యాలేగాని పూర్తి నిజాలు కావు.

# చీకటిలో

చీకటిలో, కారు చీకటిలో
కాలమనే కడలిలో
శోకమనే పడవలో
ఏ దరికో – ఏ దెసకో ॥

మనసున పెంచిన మమతలు పోయె
మమతలు పంచిన మనిషే పోయె
మనిషే లేని మౌనంలోన
మనుగడ చీకటిమయమై పోయె
లే రెవరూ – నీ కెవరూ ॥

జాలరి వలలో చేపవు నీవే
గానుగ మరలో చెరుకువు నీవే
జాలే లేని లోకంలోన
దారే లేని మనిషివి నీవే
లేరెవరూ – నీ కెవరూ ॥

ఈ పాట కూడా "మనుషులు మారాలి" చిత్రం లోనిదే.

# "పంతులమ్మ"లో పద్యం

అంహో దుర్భరమాయె భారతము ! గ
ర్వాంధుల్, దురార్భాట సం
రంహుల్, స్వార్థపరుల్ చరింతురిట ! వీ
రల్ సేయు ఘోరాలపై
సింహంబోయన లేచి, నేనిక మహో
క్ష్వేళాధ్వనిన్ వీరలన్
సంహారం బొనరించు శక్తిని జగ
న్మాతా! ప్రసాదింపుమా!

సినిమాకు పద్యం రాయడం అంటే నాకు చాలా ఇష్టం. నవతా ప్రొడ్యూసరు కృష్ణంరాజుగారు తమ "పంతులమ్మ" చిత్రంలోని శివాజీ నాటకాని కొక పద్యం కావాలంటే ఇది రాశాను. రాసిన తర్వాత ఎవరో – కృష్ణంరాజుగారే కాబోలును – ఇందులోని తుది పాదంలో యతి భంగమయిందన్నారు. ("సం"తో "న్మా" యతి కుదరదనుకొని) దానికి ముందు పాదంలోని "వీరలన్" లో ఉన్న నకారపు పొల్లుతో "న్మా" కి యతి కుదిరిందన్నారు. ఇటువంటి ఛందో రహస్యాలు చాలా మందికి తెలియవు. దీర్ఘాక్షరంతో ప్రారంభమయిన కంద పద్యంలో నాలుగింట జగణం వెయ్యకూడదని కొందరికి తెలియదు.

బిందు పూర్వక హకార ప్రాస నిర్వహించడం కష్టం. విశ్వనాథ సత్యనారాయణగారు తమ విశ్వేశ్వర శతకంలో "అంహోవారణకుంభ పాటనకళోద్యచ్ఛ్వేత భూ భృద్దరీ సింహస్వామి" అని ప్రారంభించి నాలుగో పాదంలో "నచాహం హంతవ్య" అని ప్రాస చేశారు. సంస్కృతంలో వారు ప్రాస వాడితే నేనెందుకు ఇంగ్లీషులో వాడకూడదని

"సింహాలకు Zoo లుండును
సంహారమె సృష్టియగును సామాన్యముగా
అంహస్సెయగును పుణ్యము
Somehow మన కవనధార స్రవియించు –"
అని రాశాను.

# ఒక "ప్రసాద్ ఆర్ట్స్" చిత్రం నుంచి

ఇంత పాతివ్రత్య మెవడు భరిస్తాడు
ఇంతి కాదెది దంతి ఇనుప బంతి

పతి భక్తి యనరాదు పాత విధీ! దీనిని
పతి హింస యనుచు చెప్పడమె లెస్స

ఈయమతో బ్రతు కిహలోక నరకమే
ఈ యిల్లు వదలడం హోయి హోయి

సతి వద్దు సంసార సంకటమే వద్దు
సన్యాసి యొక్కడే ధన్యజీవి

కనుక మతి చెడిపోవకమునుపె ముద్దు
లొల్కు సిల్కు కాషాయములొగి ధరించి
పరుగు తీసెద కాశికి వడి వడి వడి !
శపథమిది, సత్యమిది, సునిశ్చయము నిదియె !

"ప్రసాద్ ఆర్ట్స్" వారి "భార్యా భర్తలు" చిత్రంలో "విరటుని రాణివాసమున --" అని ప్రారంభమయే చంపకమాలా వృత్తం రాసింది మొదలు వారి చిత్రాలకు చాలా పద్యాలు రాశాను. అటువంటి వాటిలో ఇదొకటి.)

# 'కురుక్షేత్రం' నుంచి

ధర్మ క్షేత్రం ఇది కురుక్షేత్రం
కురుపాండవ రోషానల రణక్షేత్రం
రథ గజ హయ పదాతిదళ సరభస గమనం
ప్రళయ ఘనాఘన భీషణ భాంకృతి నినదం!

కపిధ్వజాంచిత సితాశ్వరంజిత
రథస్థిరులు కృష్ణార్జునులు
విజయుడు రథి, గోవిందుడు సారథి
ఉభయులు నరనారాయణులు
గ్రీష్మాదిత్యుడు భీష్మాచార్యుడు
తాళధ్వజ విస్ఫారితుడు
రంగత్తుంగ మదేభ నిభాంగుడు
రారాజు దుర్యోధనుడు

మంచి చెడ్డలకు నడుమ నిరంతర ఘర్షణసాగే
మానవ జీవితమే ఒక మహాభారతాఖ్యానం
నరులుండే ఇల సకలం కురుక్షేత్రమే – ఇట
జరుగుతుంది అనుక్షణం ధర్మయుద్ధమే !

బాహుబలోదగ్రులు బడ
బాగ్ని శిఖా విస్ఫీతులు
మోహరించి రాహవమున
తనయులు తండ్రులు తాతలు
అనివార్యం యుద్ధం – శర
సంధానమె ధర్మం – ఆ
ధర్మ పరీక్షాంగణమే కురుక్షేత్రం ॥

"కురుక్షేత్రం" చిత్రంలోని పతాక సన్నివేశానికి రాసిన పాటయిది. పాట మరీ పొడుగయిపోతుందని చాలా లైన్లు రికార్డు కాలేదు. వాటిలోకొన్ని---

స్థితప్రజ్ఞు డతినిర్మలచరితుడు, ధర్మాయుధుడు యుధిష్ఠిరుడు
రవితేజస్సముదీర్ణుడు కర్ణుడు మైత్రీబంధవినిష్ఠితుడు
రిపుమర్దనదోర్దాముడు భీముడు శపదనిలద్ధ గదాధరుడు
ధనురాగమనిష్ణాతుడు ద్రోణుడు కదన వ్యూహ విశారదుడు
పాండవ సేనాపీరుడు ధృష్టద్యుమ్నుడు దుస్సహుడు
మదపతిగణచాపల్యుడు శల్యుడు మదిరాపోశన నిస్సముడు
యౌవనరక్తవిజృంభణఘనుడభిమన్యుడు సమరోత్సాహికుడు
శకునిమామ మోసాలకు ప్రతినిధి కుటిలతంత్ర సన్నాహకుడు
--- ఇంకా యిలాగే ఎన్నో.

# దేవుడు లేదని

దేవుడు లేదని అనకుండా – మరి
ఏమని నన్ననమంటారు?
కనరాడంటే మండిపడి – ఈ
కబోదిమాటే వినలేరు ॥

కలహం కలుషం మోసం – పరి
వేదన రోదన ద్వేషం
అన్నీ చూస్తూ ఉంటే – హాఁ – సొద
లన్నీ వింటూ ఉంటే
ఆర్చేవాడూ తీర్చేవాడూ
లేనే లేదని అంటాను॥

తల్లీ తండ్రీ గురువూ చెబితే
గుండెలు గుడిగా చేశారు
నింగీ నేలా పంజరమై – హహ!
మనిషిని చెరలో వేశారు
భక్తికి భీతికి బానిసలే వా
డున్నాడున్నాడంటారు. ॥

ఆగక సాగే ఘోరం – అ
న్నార్తుల హాహాకారం
ఇంకా ఇంకా ఎన్నాళ్ళు – ఈ
హీనుల దీనుల కన్నీళ్ళు?
కరుణామయుడే ఉంటే ఎందుకు
మనకీ దుర్భర జన్మాలు ॥

*  *  *

తులసీ పాటలతో, విఘ్నేశ్వరస్తోత్రాలతో, వేంకటేశ్వర సుప్రభాతాలతో హోరెత్తిపోయే తెలుగు సినీమాలోనిదేనా – పచ్చి నాస్తికత్వాన్ని ప్రబోధించే ఈ పాట అని కొందరికి ఆశ్చర్యం కలగవచ్చును. కాని యిది సినీమా పాటే. "కరుణామయుడు" అనే చిత్రంలోనిది. ఆ కరుణామయుడు మరెవ్వరో కాదు. సాక్షాత్తు దేవుడి కొడుకయిన ఏసునాథుడే! ఈ చిత్రం క్రీస్తు మహిమలు పొగడడానికే తప్ప నాస్తికత్వాన్ని ప్రచారం చెయ్యడానికుద్దేశించింది కాదు.

# ఓ మై గాడ్

ఓ మై గాడ్ !
ఈ ఘోరం చేసిందెవరు....నీవే, నీవే
ఈ నేరం నాది కాదు నీదే నీదే

మనిషిని పోలిన మనిషిని చేసి
మోసం చేశావే
బ్రతుకులతో చెలగాటాలాడి
ప్రాణం తీశావే
నీవొక దేవుడివేనా
నీ న్యాయమిదేనా ॥

Is there a reason ? Is there a goal ?
Who is an idiot ? Who is a fool ?

ప్రేమను నాటిన వాడవు నీవే
దానికి పోసిన జీవం నీవే
పెంచిన మొక్కను నీ చేతులతో
త్రుంచిన పాపం నీదే నీదే
నీ వొక దేవుడివేనా
నీ న్యాయమిదేనా ॥

పోనీలే, నీ మాటే కానీ
నేరం నాదే, దోషిని నేనే
అయినా దోషిని వదిలేశావే
నిరపరాధినే దండించావే
నీ వొక దేవుడివేనా
నీ న్యాయమిదేనా ॥

My Lord In your high court, in your sight
Is right wrong and is wrong right ?

వేదనలే వెదజల్లెద వేలా?
వేడుక చూడడమే నీ లీలా?
మానవులంతా కీలుబొమ్మలా
నీవాడించే తోలు బొమ్మలా
నీ వొక దేవుడివేనా
నీ న్యాయమిదేనా ॥

ఇది కూడా ఒక తెలుగు సినిమాలోనిదే. ఇంతకంటే ఎక్కువ చెప్పి దైవభక్తులకు నొప్పి కలిగించడం నాకిష్టం లేదు. యస్.పి. బాలసుబ్రహ్మణ్యం ఎంతో ఉద్రేకపూరితంగా పాడిన పాటలలో ఇదొకటి అని మాత్రం చెప్పి ఊరుకుంటాను.

# పనిచేసే రైతన్నా

పనిచేసే రైతన్నా
పాటుపడే కూలన్నా
రండోయ్ రా రండోయ్ – మన
కలలు పండే రోజొచ్చింది ॥

చేతినిండా పనివుంది
చేతుల్లో బలంవుంది
కొండల్నే పిండిచేసి
వరదలకు కరువులకూ
ఆనకట్ట కట్టేద్దాం
జలాలతో పొలాలనే పండిద్దాం
జనాలలో ఆనందం నిండిద్దాం ॥

నేల మనది నింగి మనది
గాలి నీరు వెలుగు మనది
అదునుచూసి పదును చేసి
అన్నింటిని అదుపుచేసి
మనదారికి మళ్ళిదాం
తరుగులేని సంపదలే కురిపిద్దాం
చెరిగిపోని చరిత్రనే సృష్టిద్దాం ॥

ఈపాట "పద్మాలయా" వారి "పాడి పంటలు" చిత్రంలోనిది : కథానాయకుడు కృష్ణమీద చిత్రీకరించిన పాట. "దేవుడు చేసిన మనుషులు" చిత్రంలో నా పాటలను తెర కెక్కించడానికి వేన వేల రూపాయలు వెచ్చించడానికి పద్మాలయా సంస్థ వెనుదీయలేదు. అంత భారీయెత్తున కాకపోయినా ఈ పాటకు కూడా ఎక్కువ వ్యయమే అయింది.

# మీసం మీద సీసం

సదానందం

మామా! శత్రు భయంకర నామా!
అందానికి చందమామా ?
బలమున గామా! నీవేకద మా ధీమా ?
గుణధామా! విశ్వాభిరామా! మామా !

జోగారావు:

కారుమబ్బుల బారు సేరునేలెడి తీరు
కోరమీసము పొందు కోరుకొందు
మృగరాజు జూలునే తెగనాడ జాలు నీ
ఘన మీసము పసందు కనుల విందు
గండు చీమల దండు కదలాడినటులుండు
నీ మీసము తెరంగు నీలిరంగు
మెలిపెట్టి నిలబెట్టు మీసాల రోసాలు
గగన మండలముపై కాలు దువ్వు
ఎవరు మోయుచున్నారు ఈ అవని భారము
ఆదిశేషుడా, కూర్మమా, కాదు కాదు
అష్టదిగ్గజ కూటమా ? అదియు కాదు

సదానందం : అయితే మరేదయ్యా?

జోగా : మామ మీసాలె భువికి శ్రీరామరక్ష !

* * *

ఇది కూడా ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్‌లోనిది. "కులగోత్రాలు" నుంచి.

# ఒక జావళీ

నిను జేర మనసాయె రా - నా స్వామి
చనువార దయసేయరా ॥

విడిదికి రమ్మని చాల వేడితిరా
బిడియము నీకేలర్రా, దొరా॥

సరసుడవని నిన్నె పదిమంది పొగడ
మరి మరి కోర్కెలు విరిసెను ప్రియుడా !
వయసు నీకొరకె పలవరించెరా
తనువు నిన్ దలచి పులకరించెరా
మగువ కోర మొగమాటమేలరా
బిగువు మాని జవరాలి నేలరా
సొగసు చూచి ఎదురుకాచి నిలిచి
పగల్ రేలు దిగుల్ చెందు, చెలికి
నినుజేర మనసాయెరా!

ఈ జావళీ "బొబ్బిలి యుద్ధం" లోనిది. మీరు "జావళీలు కూడా రాయగలరా" అని నన్నడిగాడు సంగీత దర్శకుడు రాజేశ్వరరావు. "కలనో లేనో చూడం"దని అతడిచ్చిన ట్యూన్‌కి ఇది రాశాను.

# వాలుచూసుకో

వాలు చూసుకో, వీలు చూసుకో
వంగపండు వన్నెదాని వలపు దోచుకో
వాటమైన మేటి దొరా వయసు వాడుకో ॥

చురచుర చూస్తే వెన్నలా కరిగింది
చిరచిర వస్తే జున్నులా విరిగింది.
సొగసే నీది తన మనసంతా నీది
ఎగిరే లేడి అది నీకే జోడీ
సై అంటే సై అంది బలే కిలాడి ॥

తళతళలాడే రవ్వలా మెరిసింది.
కువకువ లాడే గువ్వలా పలికింది
కలలో నీవే తన కళ్ళలో నీవే
కులుకు మిటారి ఇది మరుని కటారి
నీ జంట కోరింది వగల వయారి॥

దీన్ని ఈ కాలపు జావళీ అనవచ్చునేమో. ఇది "గౌరీ ఆర్ట్ ఫిలిమ్స్" వారి "దేవుడిచ్చిన భర్త"లోనిది.

# తప్పు తప్పు తప్పు

తప్పు తప్పు తప్పు
అదిగో అదే తప్పు
అలా చూడటం తప్పు
ఇలా చేయడం తప్పు
తప్పనుకుంటే అంతా తప్పే ॥

ఆడదాన్ని ఆస్తిలాగ వాడడమే తప్పు
ఎదిరించిన దాన్ని రచ్చ కీడ్చడమే తప్పు
కప్పవలసిన చీర విప్పటమే తప్పు
తప్పును ఒప్పుగ చూపె వాళ్ళకే మెప్పు॥

నాచో నాచో గోరీ మేరీ ప్యారీ
తెలిసీ తెలిసీ కాని పనులు చేసేవారంతా
తెలివిగ దైవం చాటున దాగటమే వింత !
మనలోనే ఎందరో తెగబడి చేసే తప్పు
సమాజానికి తీరని అప్పు
తప్పుమీద తిరుగుబాటు చేయడమే ఒప్పు॥

ఈపాట తిలక్ దర్శకత్వం వహించిన, పెండ్యాల సంగీతం కూర్చిన "కాళ్లేటి కాపురం" చిత్రంలోనిది.

# ఓహో మేఘ సఖా!

ఓహో మేఘసఖా
ఒకచోట ఆగేవో
నాతో పగదార్చి
చాటుగ దాటేవో ॥

నాకలలు వ్యర్థమయి నీవలె నేనే నిలిచా
మా కథలే ఆపదలై అందరిలాగే వున్నా
మేడయే ఆమె వీడు
పూరిల్లే నా గూడు
బాధలే నా తోడు
ఇక నా ప్రేయసి నాకు
చేరువ కాదేనాడు ॥

ఊరంతా నిదురించె జాగరమే నావంతు
జగమంతా నవ్వింది ఏడ్చెనులే నెలరేడు
బాట యిదే బహుదూరం
పయనం ఎంతో భారం
నాగతి యిప్పుడు చూడు
ఇక నా ప్రేయసి నాకు
చేరువ కాదేనాడు ॥

ఇది బి. ఆర్. పంతులు దర్శకత్వం వహించిన, యం. జి.ఆర్. నటించిన ఒక తమిళ చిత్రానికి తెలుగు డబ్బింగ్ వెర్షనులో రాసిన పాట. దీనిని ఘంటసాల పాడినప్పటికీ గ్రామ ఫోను రికార్డుగా వచ్చిందో లేదో సందేహమే. ఎందుకంటే అప్పటికే కొందరు సినీ రచయితలు బయలుదేరి డబ్బింగు పాటంటే అసహ్యం పుట్టించేశారు. డబ్బింగు పాటలను గ్రామఫోను కంపెనీలవాళ్లు రికార్డులుగా విడుదల చెయ్యడానికి భయపడిపోయారు. ఇప్పటికీ ఆ సంప్రదాయం అలాగే కొనసాగుతోందనుకుంటాను.

## "విప్లవ శంఖం" నుంచి

చెరసాలల శిరసులపై
ఉరికొయ్యల చివరలపై
ఎగురుతుంది తిరుగుబాటు బావుటా!
సాయంకాలపు ఉరికంబం,
తెల్లవారితే రవిబింబం !
మూయించిన ఒక వీరుని కంఠం
వేయి గొంతుకల విప్లవశంఖం!
పతిత దళిత జనరణ హుంకారం
ప్రళయ సమయ దిగ్గజ ఘీంకారం ॥
బ్రదుకు సంతలో ముళ్ళపుంతలో
ఎండు డొక్కలే ఎర్రమల్లెలై
కర్మల జన్మల గందరగోళపు
కుళ్ళిన ఈ కుష్టు వ్యవస్థలో
అల్లాడే నేటి దీనులే
రేపటి విముక్తి వీరులై
విప్లవ శంఖం వినిపిస్తారోయ్ ॥
కష్టం చాలక కడుపు మంటచే
తెగించి సమ్మెలు చేసే వాళ్ళూ
నిరపరాధులై నిరాధారులై
చెరసాలల్లో చిక్కే వాళ్ళూ
చదివిన చదువులు గుదిబండలుగా
నిరుద్యోగులై కుమిలే వాళ్ళూ
అనేకులింకా అభాగ్యులంతా
అక్రమాలపై సవాలు చేస్తూ
విప్లవశంఖం వినిపిస్తారోయ్ ॥

ఈ పాటకి వివరణలూ, వ్యాఖ్యలూ అక్కరలేదు. అప్పుడప్పుడు సెన్సార్లూ, కొందరు రాజకీయవాదులూ చెప్పేటట్లు "నో కామెంట్స్"

# జాగోరే జాగో

జాగోరే జాగోరే జాగో
జాగ్ రహోరే
దేఖోరే దేఖోరే దేఖో
తూరుపు తెల్లారె
చాలు చాలు నీ నిద్దర మత్తు
లే లే ఎర్ర పంజా నెత్తు॥

పోయిస్తే సారా చుక్క
పారేస్తే మాంసం ముక్క
కుక్కకే సలాము చేస్తావా
నక్కకే గులాము అవుతావా ?!

పేదవాడివేమో నీవో
బిచ్చగాడివి మాత్రం కావు
కూటికి కరువైనా నీవు
నీతికొరకే నిలబడతావు ॥

పీడించే రక్కసి వీడు
కీడెంచే ఫుండాఖోరు
పాపాలే పండినవాడు
పామువిషం నిండినవాడు
వీడినే సమాధి చేయాలి
భావికే పునాది వేయాలి ॥

ఈ పాట శ్రీశ్రీ సమర్పించు "మహాప్రస్థానం" లోనిది. అయితే చిత్రకథ మాత్రం నాది కాదు. కొన్ని సంభాషణలూ, అన్ని పాటలూ ఈ చిత్రానికిగాను రాశాను.

# వస్తున్నాయి

వస్తున్నాయి–వస్తున్నాయి
జగన్నాధ రధచక్రాలు–ఇవి
శ్రామిక జన సంకల్పాలు
సామ్యవాద సోపానాలు – ఇక
అడ్డురావు ఆటంకాలు ॥

పోరాటమే బాటగా
లెండి లెండి లే లెండిరా
సమ్మె హక్కులే నొక్కి చాటగా
రండి రండి రా రండిరా ॥

ఏకమైన శ్రమ శక్తికి
ఎదురులేదు ఈ లోకంలో
ధనవంతులూ, బలవంతులూ
నిలువలేరు మనధాటికి
కలసిరండి కదలిరండి
తెలుసుకోండి మన గమ్యం ॥

వేచివేచి విసిగిపోయి
ఓరిమి చచ్చిందిరా
అటో ఇటో తేల్చుకొనే
సమయం వచ్చిందిరా

బెదరింపుల కెదరింపులె జవాబుగా
పదండిరా పదండిరా హుషారుగా పదండిరా ॥

పోయేవి, తెగి రాలిపోయేవి, తెగటారి
పోయేవి మన దాస్య బంధాలే

వచ్చేవి, విజయాలు తెచ్చేవి, సుఖశాంతు
లిచ్చేవి మన భావి సంఘాలే ॥

* * *

"జగన్నాధ రధచక్రాలు" అనే చిత్రంలోనిదీ పాట. చక్రవర్తి మ్యూజిక్ డైరెక్టరనీ, ఎస్.పి. బాలసుబ్రమణ్యం గాయకుడనీ నాని వేరే చెప్పనక్కరలేదు

# ప్రజాశక్తి కదిలింది

ప్రజాశక్తి
ప్రజాశక్తి
ప్రజాశక్తి కదిలింది
దగాపడిన
సహోదరుల
మహాశక్తి రగిలింది ॥

పాడు నమ్మకాల గోడ
పడగొట్టిన ప్రబలశక్తి
తరతరాల దోపిడిపై
ధ్వజమెత్తిన సమరశక్తి ॥

కల్లబొల్లి గారడీల
చిల్లర బాబాలమీద
దేవుడి గూండాలమీద
తిరగబడే ప్రళయశక్తి ॥

అమ్మలు దద్దమ్మలనీ
దిమ్మలనీ బొమ్మలనీ
నాగళ్ళే దేవుళ్ళని
చాటించే శ్రామికశక్తి ॥

మోసపోయి చీలిపోయి
చెదిరిన మన జనమంతా

కలిసి మెలసి ఒకటయింది
తన సత్తువ తెలుసుకొంది

బంధనాలు పగులగొట్టి
ప్రాణాలను పణంపెట్టి
ఉప్పొంగిన ఉప్పెనలా

నిప్పుల పిడుగుల జడిగా
దైవశక్తి నెదిరించే
ధార్మిక కార్మికశక్తి
పుడమితల్లి విముక్తికై
తుది సమరం సాగిస్తూ
ప్రజాశక్తి కదిలింది !

మాదాల రంగారావు పిక్చరంటే సెన్సార్ అభ్యంతరాలు తప్పవు. ఆ ఇబ్బందులన్నీ దాటి, 'ప్రజాశక్తి' చిత్రం ఈ  పుస్తకం వెలువడకముందే విడుదలకాగలదని ఆశిస్తున్నాను.